# ధీరోదాత్తులు

(కొందరు సామాజిక కార్యకర్తల పరిచయాలు)



గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం

తెలంగాణా - ఆంధ్రప్రదేశ్

**ధీరోదాత్తులు**

(కొందరు సామాజిక కార్యకర్తల పరిచయాలు)

**గౌరవ్**

జనవరి, 2016

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం ప్రచురణ

ప్రజాస్వామ్య ప్రచార ఐక్యవేదిక సారథ్యంలో

ప్రతిపాదిత చందా : 20/-

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

Heroes are those with the courage to leave what they have their lands their family, their property-and move out, not without fear, but without succumbing to their fear.... admire these heroes because we deeply feel their way is the way we should want to be – if we could. But being afraid, we believe that we cannot be that way that only the heroes can. The heroes become idols; we transfer to them our own capacity to move, and they stay where we are because – "We are not heroes" ..... Society, though, is not made up of heroes. If long as the tables were set for only a minority, and the majority had to serve the minority's purposes and be satisfied with what was left over, the sense that disobedience is sin had to be cultivated.

– Erich Fromm



# అంకితం



అణగారిన ప్రజల ఆపద్బాంధవుడు
బాధిత వర్గాల పోరాట వీరుడు
రైతాంగ ఉద్యమ నిర్మాత
ప్రజా సంఘాల నేత
ఆదివాసీ గుండెచప్పుడు
డా॥ **బి.డి. శర్మ**గారి
అనితరసాధ్య కృషికి... అపురూపంగా...

# ధీర క్రమం





# ధీరవాక్యం

**ధీ**రత్వం శారీరక బలం కాదు, మానసిక స్థిరత్వం. కావాలనుకుంటే అది రాదు, ఒద్దనుకున్నా వస్తే పోదు. ఏదో రూపంలో జీవితాంతం వెంటాడుతూనే ఉంటుంది.

అలా వూరికే వెన్నాడి ఊరుకోదు.

ఉన్న పనిని పూర్తి చెయ్యమని తొందర పెడుతుంది.

కొత్త పనిని ప్రారంభించమని ముందుకు నెడుతుంది.

ముళ్ళబాటే కావొచ్చు,

ముందు, ముసళ్ళ పండుగే ఉండొచ్చు

ఐనా, నడక ఆపనివ్వదు, నడత మార్చనివ్వదు.

నిజమే

పట్టింపు ఒక వ్యసనం.

లోకంలో చాలామంది ధనాన్నీ, సుఖాన్నీ, హోదానీ, పరపతినీ, భక్తినీ, రక్తినీ పట్టించుకొంటారు.

ఇంకొందరు చదువునీ, సంస్కారాన్నీ, వ్యాపారాల్నీ, విలాసాల్నీ, విషాదాల్నీ పట్టించుకొంటారు.

మరికొంతమంది చూడ్డాన్నీ, వ్రాయడాన్నీ, ఆడ్డాన్నీ, ఎదగడాన్నీ, తిరగడాన్నీ వొంట పట్టించుకుంటారు.

ఇవన్నీ ఏదోరకంగా చేస్తూ కూడా ఎక్కువగా మరొకర్ని గురించి పట్టించుకొనే ఆ పట్టింపుంది చూసారూ, అదే **ధీరగుణం.**

అన్యాయం పెరిగిపోతోందనీ, అక్రమాలు జరిగిపోతున్నాయనీ అస్తమానూ సణక్కుండా, తోచినప్పుడల్లా అరవకుండా కుదిరినంతలో పక్కవారి కోసం ఆలోచించడమే ధీరుల లక్షణం.

పిచ్చితనమంటారు, చాదస్తమనుకుంటారు. ఏం తోచక చేస్తున్నారనుకుంటారు. తిన్నదరక్క తిరుగుతున్నారంటారు.

అయినవాళ్ళు చిరాకుపడతారు. కానివాళ్ళు కయ్యానికి కాలుదువ్వుతారు. తక్కినవాళ్ళు తమాషా చూస్తుంటారు.

విసిగించేవాళ్ళు, వినిపించుకోనివాళ్ళు, చీదరించుకునేవాళ్ళు, ఛీకొట్టే వాళ్ళతో పోలిస్తే వినేవాళ్ళు, ఆదరించేవాళ్ళు, వెన్నుతట్టి ప్రోత్సహించేవాళ్ళు ఎంత తక్కువో!

ఐనా, మనుషుల్ని పట్టించుకున్న మనుషుల్ని మించిన ధీరోధాత్తులెవరుంటారు?

జంతువుల్నీ, పశుపక్ష్యాదుల్నీ, పర్యావరణాన్నీ పట్టించుకోవడం కూడా మానుషత్వానికి ప్రతీకే.

నాగరిక స్వభావం బహుశా పట్టింపుతోనే ప్రారంభమై ఉంటుంది.

దేవుడు మానవుణ్ణీ, మానవుడు దేవుణ్ణీ పట్టించుకోవడమే మతగ్రంథాల సారం.

నాయకులు ప్రజల్నీ, ప్రజలు నాయకుల్ని పట్టించుకోవడమే ప్రభుత్వాల మార్గం.

ఒకర్నొకరు పట్టించుకోడమే కుటుంబాల మనుగడకి కలిసొచ్చే చిహ్నం.

అలా ఏదైనా ప్రత్యేక లక్ష్యాన్ని సమిష్టిగా పట్టించుకోవడమే ఉద్యమం.

ఆ పట్టించుకొనేతనాన్నే సామాజిక స్పృహ అంటాం.

అలా పట్టించుకొనేవారినే సామాజిక కార్యకర్తలంటాం.

సామాజిక కార్యకర్తలంతా ఉద్యమకారులు కావాలని లేదు. కాని ఉద్యమ కారులంతా సామాజిక కార్యకర్తలై తీరాలి.

సమాజం గురించి పట్టింపునే సామాజిక స్పృహ అంటాం. ఎవరికి వారు ఇది వారికుందనే అంటారు. కాదంటారా అని నన్నడగొద్దు, కొలమానం మీ హృదయమే అంటాన్నేను.

ఒక్క రూపాయి ఖర్చు పెట్టడానికి సవాలక్ష ప్రశ్నలు వేసే కోట్లాదిమంది సంపాదనపరులతో పోలిస్తే రోజుకూలీలో కూడా కొంత మిగుల్చుకొని మరొకరికోసం వెచ్చించేవారున్నారు.

ఒక్క గంట సమయం కేటాయించడానికి రోజులకొద్దీ వెంట తిప్పుకునే నాయకులతో చూస్తే సొంతంగా సెంటు భూమి కూడా లేకుండా స్వచ్ఛంద సేవకు సిద్ధపడినవారున్నారు.

ఒక్క పూట భోజనం పెట్టడానికి లేని లేకితనంతో రాని నవ్వుని ఎరువు తెచ్చుకొని సూటిపోటి మాటల్తో బాధించేవారితో పోలిస్తే ఉడికించుకున్న గంజిలో మనకీ కొంత పోసే వారెందరో.

ప్రపంచీకరణ ప్రభావంతో పట్టింపు కూడా వ్యాపారమై భోగాల్ని రోగాల్నే కాని త్యాగాల్ని గురించి పట్టించుకోడానికి కూడా సమయం లేని ఈ తరం సాంకేతిక వ్యాధిగ్రస్తుల్ని నిద్రలేపేందుకు ఇదో చిరు ప్రయత్నం.

నిద్రపోతోన్న వార్ని లేపగలం కాని నిద్ర నటించేవార్ని లేపలేకపోవచ్చునుగానీ పడుకుంటే ఏం జరుగుతుందో తెలియజేయగలం. లేవకపోతే ప్రమాదమని హెచ్చరించగలం.

అందులో భాగంగా నూతన సంక్షోభాలు తలెత్తుతున్న సంక్లిష్ట సమయంలో వేతన బానిసలౌతున్న తోటి యువతకు సామాజిక స్పృహతో యాతనల్ని ఎదిరిస్తున్న కొందరు ధీరుల్నిలా పరిచయం చేస్తున్నాను.

పదండి మరి

**- గౌరవ్**





# 1

## కేరాఫ్ సోషలిజమ్

# కేశవరావ్ జాదవ్‌గారు

ఆయనో సమతావాద స్వాప్నికుడు, సమాజవాద యాత్రికుడు. ఈ దేశానికెలాంటి సామ్యవాదం అవసరమో నిర్ధారించడానికి జీవితాంతం శ్రమించిన అవిశ్రాంత యోధులు జె.పి., లోహియాల చేత 'కేశవ్' అని ప్రేమగా పిలిపించుకున్నవాడు. మిస్టర్ తెలంగాణగా పేరొంది లెక్కలేనన్ని ఉద్యమాల్లో 17 సార్లు అరెస్టయినవాడు. ఆయనే కేశవరావ్ జాదవ్. పుట్టింది హైదరాబాద్. పూర్వీకులు మహారాష్ట్ర నుంచి వొచ్చారని ఆయనంటారు. ఉస్మానియాలో ఎమ్.ఏ. చేసి వివిధ ప్రాంతాల్లో ఉద్యోగం చేసారు. కుటుంబంపై ఆర్య సమాజ ప్రభావం అధికం. దాంతో కులాంతర వివాహాలు చెప్పుకోదగ్గన్ని జరిగాయి. హైస్కూల్లో వుండగానే డి.యస్.యు. విద్యార్థి సంఘంలో చురుకుగా పాలుపంచుకునేవారు. ఆనాటి సోషలిస్టు నాయకులు బి. సత్యనారాయణరెడ్డి, వై.ఎస్. రావ్, ఠాకూర్ మహదేవ్‌సింగ్ ప్రోద్భలంతో సోషలిస్టులతో పరిచయం వృద్ధి చెందింది. మతాన్ని విమర్శించారనే నెపంతో దయానంద సరస్వతి రాసిన 'సత్యార్థ ప్రకాశిక' గ్రంథాన్ని నిజాం ప్రభుత్వం నిషేధించింది. అలాంటి వాతావరణం సహజంగా బాల్యంలోనే కేశవ్‌గారిపై బలమైన ముద్ర వేసింది. సోషలిస్టు ఉద్యమంతో సంబంధాలు బలపడి జె.పి., లోహియాలకు సన్నిహితుడుగా మారాననే ఆయన కుల సమస్య, భాషా సమస్యలపై లోహియా భావాలు తనపై చాలా ప్రభావం చూపాయంటారు. ఆ క్రమంలో వివిధ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. అనేకమంది గాంధేయవాదులు మొదలుకొని తీవ్రవాద భావాలు గల కమ్యూనిస్టుల వరకూ జాదవ్‌గారి వ్యక్తిత్వంతో ఆకర్షించబడిన వారెందరో. హెక్టార్ అభయ్ వర్ధన్ అనే సింహళీయుడు వర్కింగ్ ఎడిటర్‌గా లోహియా సంపాదకత్వంలో వెలువడిన 'మేన్‌కైండ్' పత్రిక సంపాదక వర్గంలో జాదవ్ కూడా ఒకరు. తదనంతరం 'Towards a Better Mankind' గా పేరు మార్చుచేసి చాలా సంవత్సరాలు పత్రికను ప్రత్యామ్నాయ విలువలతో నడపడానికి ప్రయత్నించి వల్లకాక ఆపేశాననే ఆయన

తర్వాత కాలంలో ఢిల్లీ నుండి రమామిత్రగారు కొద్దికాలం నడిపారంటారు. కేరళలోని సోషలిస్టు ప్రభుత్వం ప్రజలపై కాల్పులు జరిపించిన ఘటనలో రెండుగా చీలిన పార్టీలో తాను లోహియా పక్షమే వహించానని చెప్పే జాదవ్‌గారు జె.పి.ని చనిపోయే ముందు రోజు చూడ్డానికి వెళితే 'ఇంత చలిలో ఎందుకొచ్చావని' తనను కోప్పడ్డ సంఘటన కలచివేసిందంటారు. ఎమర్జెన్సీ రోజుల్లో తాను వేసిన కేసు వల్లనే 27 మంది అరగంటలో విడుదలయ్యారని చెప్తూ, కాంగ్రెస్ తర్వాత ఒక దశలో రెండో అతిపెద్ద పార్టీగా వున్న సోషలిస్టు పార్టీ బలహీన పడ్డంలో స్వయంకృతాపరాధం కూడా వుందంటారాయన. భావాల్ని నిర్మాణాత్మకంగా తర్వాత తరాలకు అందించడంలో జరిగిన పొరపాట్లు కూడా ఇందుకు ప్రధాన కారణమనే ఆయన ఆచరణాత్మకంగా సోషలిస్టు పార్టీ ఫెయిలయిందంటారు. అనేక వ్యాసాలు, రచనలు చేసిన ఆయన కవితా సంపుటాల్ని కూడా ఇంగ్లీషు, హిందీ, ఉర్దూల్లో ప్రచురించారు. కార్వాన్ అనే పత్రిక జాతీయ స్థాయిలో నిర్వహించిన కవితల పోటీలో కేశవ్‌గారు రాసిన 'I will pull down the stars' అనే కవితకు బహుమతొచ్చింది. అలాగే 'హంగేరియన్ ట్రాజెడీ' మీద రాసిన కవితకు కూడా మంచి స్పందనొచ్చింది. తాను ఏర్పాటు చేసిన సభలో సుమారు 25,000 మందిని నిరుత్సాహపర్చడం యిష్టంలేక అనారోగ్యంతో కూడా సభకొచ్చి అందరిముందూ తనకి బాధ్యతప్పజెప్పిన జయప్రకాష్ నారాయణ్, ఒక్కసారి కోప్పడ్డందుకు ఎంతో సిగ్గుపడుతూ 'నాకు మీరు తప్ప ఇంకెవరున్నారని' క్షమాపణ అడిగిన లోహియాల అద్వితీయ వ్యక్తిత్వాల స్ఫూర్తిని ఈ తరం ఎన్నటికైనా గ్రహించగలుగుతుందా? అనే సందేహం 81 సం॥రాల జాదవ్‌గారి మోములో తొంగి చూస్తుంటుంది. సమాధానం చెప్పే తెగువ కాలానికే వుందని తప్పించుకోవడం తప్ప ఇంకేదైనా చేసేందుకు ముందుకొద్దామా?





# 2

## సుదీర్ఘహక్కుల బాటసారి

# శ్రీరాముల జీవన్‌కుమార్‌గారు

ఆధిపత్యానికి ఎదురెళ్ళి నిలదీయడం ఆయన నైజం. దుర్వినియోగం అవుతున్న అధికారాన్ని నిగ్గదీయడమే ఆయన ఇజం. మానవ హక్కుల చుక్కాని బాలగోపాల్ ఆయన్ని గురించి, "He is not a Marxist. By the compulsion of his personality he become an activist" అని రాసారు. ప్రజా పక్షపాతి శంకరన్‌గారైతే ఆయన్ని ప్రేమగా "Micro Level Activist" అని పిలిచేవారు. విస్మరిత వర్గాల గొంతుగా పేరొందిన ఆయన శ్రీరాముల జీవన్‌కుమార్‌గారు. వరంగల్ జిల్లా వడ్డేపల్లి గ్రామంలో పుట్టిన ఆయన బాల్యం నుంచే భూస్వామ్య వ్యవస్థను బాగా దగ్గరగా పరిశీలించారు. పదిహేనేళ్ళకే కాళోజీ పరిచయంతోబాటు కొండపల్లి సీతారామయ్య, కె.జి. సత్యమూర్తిలాంటి ఉద్దండులు ఉపాధ్యాయులుగా ఉండటంతో 'మిత్రమండలి'లో చురుగ్గా పాల్గోవడంతోబాటూ తెలంగాణ ఉద్యమంలోకి కూడా తేలిగ్గా దూకగలిగారు. ఎమర్జెన్సీ నాటికే లెక్చరర్‌గా పనిచేస్తున్న ఆయన అనంతరం సోషలిస్టు – కమ్యూనిస్టు సంఘాల సాన్నిహిత్యంతో రాజ్యహింసని ప్రశ్నించడం మొదలుపెట్టారు. తన విద్యార్థుల్నే పదుల సంఖ్యలో పోలీసులు హత్యచేయడం, తన కళ్లముందే విద్యార్థుల్ని మాయం చేయడం, ఉద్యమకారులపై విచ్చలవిడిగా దాడులు చేయడం చూసి సహించలేక పౌరహక్కుల నేతగా మారాల్సి వచ్చిందంటారు. ఇక అప్పట్నుంచీ నిరంతరం ప్రజాపక్షంగా పనిచేస్తూనే కులం, జెండర్, కరువు, ఆకలి చావులు లాంటి ఎన్నో అంశాలపై దృష్టి సారించారాయన. వరంగల్‌లో నుండగానే 'స్వేచ్ఛ'నే గోడ పత్రికను స్థాపించిన ఆయన తర్వాతి కాలంలో దాన్నే ప్రగతిశీలోద్యమ ప్రజాపత్రికగా తీర్చిదిద్ది చాలాకాలం నడిపారు. 'సృజన' సాహితీ మిత్రుల్లో ఒకరైన ఆయన అనేక రిపోర్టులు, వ్యాసాలు రాసారు. APCLCలో తలెత్తిన ఆరోగ్యకర చర్చలో ముఖ్యపాత్ర పోషించి ఆనాడు మూడు రోజులపాటు

జరిగిన సమావేశాల్లో దార్శనికంగా వ్యవహరించిన జీవన్‌గారు తదనంతరం 42 మందితో ఏర్పడిన Human right's Forum (మానవ హక్కుల వేదిక)కు మొట్టమొదటి కన్వీనర్‌గా కూడా వ్యవహరించారు. హైదరాబాద్ మినహా తెలంగాణలో మొట్టమొదటి ఫిల్మ్‌సొసైటీని స్థాపించడమే కాక ఆ రోజుల్లోనే 'ZE' లాంటి మిస్సింగ్ కేసులాధారంగా రూపుదిద్దుకున్న సంచలనాత్మక ఇటాలియన్ సినిమాల్ని కూడా ధైర్యంగా ప్రదర్శించేవారు. అంతే కాదు, 76లో ఫిల్మ్‌ఫెస్టివల్ కూడా నిర్వహించారు. కాళోజీ సాన్నిహిత్యం, ఆయన తిడితే వెళ్ళి విన్న జయప్రకాష్ నారాయణగారి ఉపన్యాసం, లోహియా భావజాలం, వరవరరావు లాంటి వామపక్ష మిత్రుల సహచర్యం, బాలగోపాల్ వంటి సత్యాన్వేషితో పనిచేసే భాగ్యం మొత్తంగా తన జీవితంపై ఎనలేని ప్రభావం చూపాయనే ఆయన, పెళ్ళైన కొత్తలో రవూఫ్ వర్గంలో చినవెంకటి (ఖమ్మంవాడు) అనే అతన్ని పోలీసులు మాయం చేసినప్పుడు కొన్ని వారాలపాటు కమిట్‌మెంట్‌తో తాను పనిచేసి అతడ్ని విడిపించిన అనుభవాన్ని ఒక సభలో ప్రస్తావించగా, నాటి 'ఆంధ్రప్రభ' పత్రిక బాక్స్ ఐటెమ్‌గా దాన్ని ప్రచురించడం, అది చూసి తనను కలవడానికొచ్చి ఉమామహేశ్వరరావు 'అంకురం' సినిమాగా దానిని మలిచి విజయం సాధించడం గొప్ప అనుభూతంటారు. అటువంటి ఎన్నో అనుభవాల్ని చవిచూసిన జీవన్‌గారు ఇప్పటికీ ప్రజా ఉద్యమాలన్నింటిలో గంగలా ప్రవహిస్తుంటారు. మౌనంగా వుండటమే ప్రజలకు చేసే ద్రోహమనే ఆయన ప్రజా సమస్యలన్నింటిపైనా స్పందిస్తూంటారు. నక్సల్బరీ, అస్తిత్వోద్యమాల్ని కూడా ప్రాథమికంగా సమర్థించినా అంతిమంగా హక్కులోద్యమ దృక్పథం సంధించే ప్రశ్నలకు అవి కూడా మినహాయింపు కాబోవని నిక్కచ్చిగా చెప్పే ఐదు దశాబ్దాల హక్కులోద్యమ ఆచరణశీలైన జీవన్‌కుమార్‌గారిదో అరుదైన ప్రజాపక్ష ప్రస్థానమనడంలో అతిశయోక్తి లేదు.



# 3

## జన విజ్ఞానమే ఆయన ధ్యేయం

## వి. బ్రహ్మారెడ్డిగారు



సమాజంలోని సర్వసామాన్యులకు కూడా శాస్త్రవిజ్ఞానం చేరువవ్వాలనేదే ఆయన కల. సంఘంలోని మనుషులందరూ సమానంగా బతకాలనేదే ఆయనలోని తీవ్రమైన అల. జీవిత విశ్వవిద్యాలయంలోనే అద్వితీయ పాఠాల్నేర్చుకున్నానని వినమ్రంగా చెప్పే వెన్నపూస బ్రహ్మారెడ్డిగారిది అలుపెరుగని ప్రయాణం. అంతులేని ఒడిదుడుకుల్ని అవలీలగా తట్టుకొన్న అనంత యానం. ప్రకాశం జిల్లా దరిశి తాలూకా, పాపిరెడ్డి పాలెం ఫ్యాక్షన్ తగాదాలకు కేంద్రం. 1951లో అక్కడ పుట్టిన బ్రహ్మారెడ్డిగారు పొతకమూరు, విజయవాడల్లో విద్యాభ్యాసం చేసి కర్నూలు మెడికల్ కాలేజీలో ఎమ్.బి.బి.ఎస్. గోల్డ్‌మెడల్ మొదటి శ్రేణిలో ఉత్తీర్ణత సాధించారు. తదనంతరం ప్రజా వైద్యశాలలకు అంకురార్పణ చేసిన నెల్లూరులోని డా॥ రామచంద్రారెడ్డి ప్రజా వైద్యశాల్లోనూ, మద్రాసు, ఢిల్లీ, కలకత్తాల్లోనూ శిక్షణ పొంది 18 ప్రత్యేక అంశాల్లో సుమారు 125 రకాల ఆపరేషన్లు చేయగల అరుదైన ప్రతిభనూ, నైపుణ్యాన్నీ సముపార్జించారు. ఫ్యాక్షన్ తగాదాలకు పేరొందిన గ్రామాల్ని చైతన్యవంతం చేయడానికి బ్రహ్మారెడ్డిగారి చిన్నతనంలో వాళ్ళ గ్రామానికి వొచ్చి ప్రజలతో గడిపిన ఆనాటి కలెక్టర్ సుబ్రతో భట్టాచార్య, జడ్జి బాన్సుదేవ్‌ల కృషీ, దానివల్ల కనబడిన ఫలితం (తర్వాత గ్రామంలో కొట్లాటలు లేవు) బ్రహ్మారెడ్డిగారిపై బాగా ప్రభావం చూపాయి. రాగి సంగటి, జొన్నన్నం తప్పా మరేదీలేని నాటి రోజుల్ని అపురూపంగా నెమరేసుకునే ఆయన అప్పటికీ, యిప్పటికీ కూడా ఆ గ్రామం నుంచీ తానొక్కడ్నే డాక్టర్నంటారు. బడిలో అల్లరిపిల్లవాడిగా పేరొందిన ఆయన ఒక్కసారి పలకాబలపం బహుమతిగా పొందిన తర్వాత ఇక తనకెవరూ చదూకోమని చెప్పే అవసరం రాలేదంటారు. 7వ తరగతిలోనే అతీతశక్తులపై నమ్మకం కోల్పోయిన ఆయన దెయ్యాల భయాన్ని జయించడం కోసం వో నెలరోజులు అర్థరాత్రి స్మశానంలో గడిపారు. ఆ దెబ్బతో భయాన్ని మించిన దెయ్యం లేదనే నిజం తెలిసొచ్చింది.

అప్పటికే రాహుల్ సాంకృత్యాయన్ నుంచీ జె.డి. బెర్నాల్ దాకా చదివేసిన ఆయన విద్యార్థి సంఘంలో చురుకుగా పాలుపంచుకున్నారు. ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాల్లో రాడికల్ సైన్స్‌గ్రూప్, యు.కె. సైన్స్ ఫర్ ది పీపుల్, యు.ఎస్.ఏ. గ్రీన్ పార్టీ, మొదలైన సైన్సు ప్రచార సంస్థలు వెలిశాయి. మన దేశంలో అస్సాం సైన్స్ సొసైటీ, ఒరిస్సా విజ్ఞాన ప్రచార సమితి, బెంగాల్ వంగీయ విజ్ఞాన పరిషత్, కేరళ శాస్త్ర సాహిత్య పరిషత్, కర్నాటక విజ్ఞాన్ మంచ్, తమిళనాడు సైన్స్ ఫోరం లాంటివి ఉన్నాయి. మన తెలుగు రాష్ట్రాల్లో కర్నూలు, విజయవాడ, విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, సూర్యపేట, నిజామాబాద్ మొదలైన చోట్ల పనిచేస్తున్న విజ్ఞాన వేదికలు, అభ్యుదయ ప్రజాచైతన్య వేదికలు, సైన్సు ఫోరాలు కల్సి 88లో జన విజ్ఞాన వేదికగా ఆవిర్భవించడం చారిత్రక సంఘటన. నాటి నుంచీ జె.వి.వి.లో తనదైన ముద్ర వేసిన బ్రహ్మారెడ్డిగారు అక్షరాస్యతా కార్యక్రమం, మద్యపాన వ్యతిరేకోద్యమం, పొదుపు కార్యక్రమం, మందుల మీద ఉద్యమం, వాటర్ షెడ్ కార్యక్రమం, గ్రామాభివృద్ధి కార్యక్రమం లాంటి ఎన్నో ఉద్యమాలకు సారధ్యం వహించారు. జన్మభూమి కార్యక్రమం మొదలుకుని ఉచిత కరెంటు పథకం వరకూ జె.వి.వి.ను నడిపించి ప్రభుత్వాన్ని కూడా ఆకట్టుకునేలా చేయడం బ్రహ్మారెడ్డిగారి ప్రత్యేకత. రాష్ట్రంలోని ప్రైవేటు ఆస్పత్రుల్లో మొట్టమొదటి ఓపెన్‌హార్ట్ ఆపరేషన్ చేసిన బ్రహ్మారెడ్డిగారు రికార్డు స్థాయిలో వేలకొలదీ సర్జరీలు చేసారు. వేలమంది కార్యకర్తల్ని తయారుచేసారు. 25 పుస్తకాలు, 400 వ్యాసాలు రాసారు. వ్యక్తిత్వ వికాస తరగతుల్ని ఐదారువేలమందికి బోధించారు. ఆడియో, టీవీ, రేడియోల్లో వందలాది ప్రసంగాలు చేసారు. 14000 ఖరీదు చేసే హెర్నియామెష్‌ను ఒక్క రూపాయికి వొచ్చేలా కనిపెట్టారు. 'ఎక్కడికీ ప్రస్థానం' రచనతో వొచ్చిన విభేదాలతో పార్టీని కూడా కాదని ప్రజలపక్షం నిలిచారు. సొంత సంస్థలోనే కుట్రల్నెదుర్కొని కుహనా విమర్శల్ని పట్టించుకోకుండా ఉత్తమ పౌర సమాజమే లక్ష్యంగా సామాజిక న్యాయమే ధ్యేయంగా దేశవ్యాప్తంగా శాస్త్రప్రచారోద్యమ కార్యక్రమాల్ని విజయవంతంగా నడిపిస్తూ, నిరంతరం పర్యటిస్తూ విజ్ఞానశాస్త్ర ప్రయోజనం సామాన్య జనానికేనని చెప్పే ఆయన ఆచరణ్నే సందేశంగా తీసుకోవడం భావితరాలకు ఎంతైనా అవసరం.





## 4

### ప్రజాసాహిత్య సారధి

# కొత్తపల్లి రవిబాబుగారు

సాహిత్యం భాషకు సజీవత్వాన్నిస్తుంది. ప్రజా సాహిత్యం సమాజాన్ని చైతన్యవంతం చేస్తుంది. అన్నిరకాల ఆధిపత్య పెడధోరణుల్ని ధిక్కరించి తిరుగుబాటు స్వరాన్ని వినిపిస్తుంది. భిన్న వాదాల్లోని డొంక తిరుగుడు విధానాన్ని ఎండగట్టి పీడితుల పక్షాన ప్రశ్నిస్తుంది. మూడు దశాబ్దాలకు పైగా చరిత్రతో, నిష్పక్షపాత చేవతో తెలుగు నేలలో అణగారిన వర్గాల బాగోగుకై పాటుపడుతున్న ప్రధానపత్రిక ప్రజాసాహితి. దానికి వెన్నుదన్ను జనసాహితి. ఎంతోమంది అక్షర హాలికులకూ, సాహితీ సేనలకూ నెలవైన ఈ అమ్ములపొదిని అబ్బురంగా కాపుకాస్తున్న సాంస్కృతిక నౌక కొత్తపల్లి రవిబాబుగారు. తండ్రి వెంకట కృష్ణవర్మ, తల్లి సరళాదేవి. ఇద్దరూ గాంధీ భక్తులు. యలమంచిలి వెంకటప్పయ్యగారి శిష్యులు. అలాంటి స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబంలో 1940లో పొన్నూరు దగ్గర మునిపల్లె గ్రామంలో రవి జన్మించాడు. అనేక ప్రాంతాల్లో చదువు సాగింది. నల్గొండలో ఉద్యోగం చేసే నాటికి సహోద్యోగి అంపశయ్య నవీన్, తద్వారా వరవరరావు మొదలగు వారితో పరిచయం అనేక చర్చలకు కారణమైంది. ఆ రోజుల్లోనే 'స్టడీ సర్కిల్' పేరిట మిత్రులతో సంస్థను స్థాపించి, వివిధ కార్యక్రమాలు చేసారు. మొహిద్‌సేన్ వంటివార్ని సైతం రప్పించి వారి ఉపన్యాసాలతో నాటి యువతలో సంచలనం కలిగించారు. 'ఆధునిక సాహిత్య వేదిక'నే టేగ్‌తో స్థాపించబడిన 'సృజన' వ్యవస్థాపకుల్లో రవిబాబు కూడా ఒకరు. ఆ క్రమంలో ఉద్యోగరీత్యా బదిలీలు, ఒడిదుడుకులు చివరికి ప్రభుత్వోద్యోగానికి రాజీనామా చేసి రేపల్లె వద్ద నగరంలో కాలేజీలో జాయినయ్యారు. ఆ కాలంలోనే 'సంవేదన' పత్రిక కూడా వస్తుండేది. అలా వాటన్నింటి ప్రభావంతో శ్రీశ్రీ షష్టిపూర్తికి వెళ్ళి విరసంలో సభ్యుడయ్యారాయన. తదనంతరం విరసంతో విభేదించి బయటకొచ్చిన మిత్రులతో కల్సి 78లో హైద్రాబాద్‌లో 'జనసాహితి' సంస్థను స్థాపించారు. కొంతకాలం రంగనాయకమ్మగారి సారధ్యంలో నడిచిన ప్రజాసాహితి

పత్రికను కూడా ఆవిడ జనసాహితికి అప్పగించడం, అప్పటికే విరసం విధానాలతో ఏకీభవించని నవోదయ, అరుణోదయలాంటి ప్రగతిశీల సంఘాలు కూడా జనసాహితిలో మిళితమవడంతో ఒక నూతన ప్రజాస్వామిక సాహిత్య సాంస్కృతికోద్యమానికి బీజం పడింది. నాటి నుంచీ నేటి వరకూ 120కి పైగా అద్భుతమయిన ప్రజాసాహిత్యాన్ని జనసాహితి ప్రచురిస్తోందనే రవిబాబుగారు భగత్‌సింగ్ రచనల్ని సంకలనంగా తెలుగులో మొట్టమొదట ప్రచురించింది జనసాహితేనంటారు. బాబ్రీ దురంతం జరగకముందే దివికుమార్‌గారు రాసిన 'అయోధ్యలో రావణకాష్టం' పుస్తకం కన్నడంలోకి కూడా అనువాదమైందంటూ దానిపై బెదిరింపులు కూడా వొచ్చాయంటారు. చైనా రచయిత లూషన్, ఆఫ్రికన్ రచయిత చినుఅ అచ్‌బీల రచనలు మొదలుకుని సుమారు పాతికమంది సాహిత్య, సాంస్కృతిక, కళా ప్రముఖులపై ప్రత్యేక సంచికలు వెలువరించామంటారు. కళాతాత్వికతపై సూర్యసాగర్ రచన తెలుగులోనే అరుదైందనే ఆయన ఛాయారాజ్, నిర్మాలానంద మొదలగువారి రచనలెన్నింటినో ముద్రించడం సంతోషం కలిగిస్తోందంటారు. 75 సంవత్సరాల వయసులో కూడా 3,500 సర్క్యులేషన్‌తో ఒక సాహిత్య పత్రికను నడుపుతున్న రవిబాబుగారు అప్పుడప్పుడు సాహిత్య విమర్శలు, కవితలు రాసానంటారు. మహాశ్వేతాదేవి రాసిన నాటకాన్ని, పాల్‌రాబ్సన్ ఆత్మకథను అనువదించినాయన అఖిలభారత స్థాయిలో 'ఆల్ ఇండియా పీపుల్స్ లిటరరీ ఫోరమ్'ను స్థాపించడమే కాక 'పీపుల్స్ లిటరేచర్' పత్రికను ఆంగ్లంలోనూ, హిందీలోనూ ఏడాదికి రెండు సంచికలు తెస్తూ అద్వితీయ రచనలతో నడుపుతున్నారు. భార్య సుధాబాల, కుమారుల సహకారంతో జనసాహితికి తనవంతు పాటు పడుతున్నానని చెప్పే ఆయన దాతల సహకారంతో జనసాహితి సొంత భవనం నిర్మించుకుందంటారు. రాజకీయ రంగ విభేదాలే సాహిత్య సాంస్కృతిక రంగంలో కూడా ప్రతిఫలించి సంస్థల చీలికకు కారణమౌతున్నాయనే ఆయన పోస్ట్–మోడర్నిజపు ప్రభావంతో నేటి సమాజం ముఖ్యంగా యువత వస్తు వ్యామోహంలో కూరుకు పోయారనీ ఈ సంక్షోభాన్ని అధిగమించడం ప్రగతిశీలోద్యమాల కర్తవ్యమంటారు. సాహిత్య, సాంస్కృతిక సంస్థల్లో సైతం పురుషాధిపత్యం, అగ్రకులహంకారం ఉన్నాయనడం ఒక తరహా గ్లోబెల్ ప్రచారమేననే ఆయన ప్రత్యామ్నాయ ప్రగతిశీల భావోద్యమ వేదికగా 'జనసాహితి'ని పటిష్టం చేయడమే తన లక్ష్యమంటారు.



# 5



## అవిశ్రాంత నిశ్శబ్ద విప్లవ ప్రతీక

# హెచ్.బి.టి. గీతారామస్వామిగారు

ఆమెది తమిళ కుటుంబం. ఒక ఒరవడిలో సాగిపోయే జీవితం. కాని వయసు జ్ఞానాన్నిస్తుంది. స్వార్థం పాలుపడని జ్ఞానం సమాజాన్ని నగ్నంగా చూసే ధైర్యం చేస్తుంది. అంతటితో ఊరుకోదు. దాన్ని మార్చే బాధ్యతను మీదేసుకుంటుంది. గీత కూడా అదే చేసింది. ఈ లోకపు అసమానతల్ని చూసి చలించిపోయి తనను తానెన్నిసార్లో దహించుకుంది. మార్చడానికి సిద్ధపడి మరోసారి జన్మించింది. ఐతే, ఈసారి అమ్మ కడుపులోంచి పసిబిడ్డగా కాదు. అడవితల్లి కడుపులోంచి, అన్యాయల నెదిరించే విప్లవకారిణిగా. ఎమర్జెన్సీ విరుచుకుపడి దేశాన్ని చీకటితో గాఢంగా కమ్మేసినపుడు, కొత్త వెలుగుల కోసం అజ్ఞాత సూర్యులతో కల్సి అన్వేషించిందామె. అక్షరాలపై సైతం పహారా కాస్తున్న ఆ కాలంలో ఆయుధంతో ఓనమాలు దిద్దుకున్నదామె. నూతన కాంతి కనబడలేదు. కాని, నాయకుల ఆధిపత్యం మాత్రం కోరలు చాపి రోజూ ఆమెకు కనిపించేది. పురుషహంకారంతో విరుచుకుపడేది. కొద్దోగొప్పో చైతన్యంతో వ్యవస్థను మార్చడానికి ఉద్యమంలోకి వస్తే, అక్కడా అదే అవ్యవస్థ అమలవుతోంది. తప్పించుకుందామని ఎటువైపు తిరిగినా కులం, పురుషాధిపత్యమే ఎదురొచ్చాయి. విప్లవోద్యమం దాటిపోయిన ప్రశ్నల్ని ముందుకు తెచ్చాయి. ప్రజల్లో చైతన్యం రాకుండా, దాన్ని తీసుకొచ్చే ప్రయత్నం చేయకుండా ఆయుధాలతో సహవాసం ప్రతీకారమో, ప్రతిఘాతమో తప్ప ప్రజాపోరాటంగా అనిపించలేదు. అలా బయటకొచ్చిన కొద్దిమంది మిత్రుల భావ సంఘర్షణలోంచి ఉద్భవించిందే 'హైదరాబాద్ బుక్‌ట్రస్ట్'. సశాస్త్రీయమైన ప్రత్యామ్నాయ ప్రగతిశీల మానవిక సాహిత్యాన్ని ప్రజానీకానికి అందించడమే లక్ష్యంగా మొదలైన హెచ్.బి.టి. దశాబ్దాలుగా నిబద్ధత విషయంలో విజయం సాధిస్తోందనే చెప్పాలి. సమాజంలో ఉన్న అన్ని సమస్యల్లాగానే కులం, జెండర్‌కూడా ఉద్యమాలన్నింటిలోనూ బలంగా ఉన్నందుకే వాట్ని పట్టించుకోవడం చైతన్యానికి చిహ్నమంటారామె. సాహిత్యానికీ

ఉద్యమాలకీ చాలా దగ్గరి సంబంధం ఉందనే ఆమె, ఈనాటి సమస్యలకు పరిష్కారాలు ఈరోజు వెతుక్కోవాలే కాని గుడ్డిగా చరిత్రలో తడమకూడదంటారు. వివాదం సమాజంలో వుందేమోకాని తమ ప్రచురణల్లో కాదనే ఆమె తనకేమి లేబుల్స్ (ముద్రలు) అవసరం లేదంటారు. అవకాశవాదులు ప్రయోజనాల కోసం చేరటం వల్లనే సంస్థల్లో కూడా చీలికలు ఏర్పడుతున్నాయంటూ, సామాజిక స్పృహ లేకపోవడం యువత తప్పుకాదనీ, ఆ దిశగా వారికి స్ఫూర్తినిచ్చేవాళ్ళు లేకపోవడమేనంటారు. క్షేత్రస్థాయిలో పాకీ పని కార్మికుల సమస్యలు మొదలుకుని అనేక సమస్యలపై ఆచరణాత్మకంగా పనిచేసినామె ఇప్పటికి 400 పైబడి మంచి పుస్తకాల్ని ముద్రించడానికి ప్రధాన పాత్ర వహించారు. ఈ క్రమంలో ఆవిడెదుర్కున్న ఒడిదుడుకులూ అపనిందలూ కూడా తక్కువేమీ కాదు. ప్రజా ఉద్యమ నిర్మాణానికి సాహిత్యాన్ని మించిన మాధ్యమం లేదనే గీతారామస్వామి గారి వాదనకు నిలువెత్తు తార్కాణమయిన హెచ్.బి.టి. దశాబ్దాల కృషిని చూస్తూ కూడా ఇది అవిశ్రాంత నిశ్శబ్ద విప్లవం కాదనగలమా, చెప్పండి.





# 6

## గప్పాల్లేని గంభీర జీవితం

## డి. అప్పారావుగారు

ఆయనో నిత్య పుస్తక ప్రేమికుడు, ప్రచురణకర్త. ప్రాథమిక విద్యకూడా చదవకపోయినా ప్రపంచ తీరుని ఔపోసన పట్టాడు. ఎన్నడూ బడికెళ్లకపోయినా విశ్వవిద్యాలయ అధిపతుల్ని కూడా శిష్యులుగా పొందాడు. విశాఖజిల్లా భీమునిపట్నం తాలూకా పెద్దిపాలెంలో అప్పలకొండ, నారాయణ దంపతులకు పుట్టిన అప్పారావుగారిది గ్రామంలో కలిగిన కుటుంబం. ఇంటికొచ్చే బుడబుక్కలవాళ్ళు పాడే రాగాల్లో 'నాగస్వరం పాట నాగేంద్రునికే ఎరుక, తివ్వదుంపలు తిన్న తట్టకేమెరుక' లాంటి చరణాలు బాల్యంలోనే ఆయనను ఆకట్టుకొనేవి. వాళ్ళూళ్లోని నాటక సమాజాల ద్వారా సత్యహరిశ్చంద్రుడి నాటకంలో లోహితాసుడి పాత్ర వేసిన ఆయన సామాజిక స్పృహతో కూడిన ఆలోచనల్ని దాన్నుంచే గ్రహించానంటారు. ఆ రోజుల్లో చిట్టివలస జూట్ కార్మికుల చైతన్యం కళ్ళారా చూసినాయన యిప్పటికీ ముగ్ధులౌతుంటారు. అజ్ఞాతంలో ఉన్న పుచ్చలపల్లి సుందరయ్యగారు ఆ ప్రాంతంలో బాలసంఘమొహటి పెట్టి దానికి అప్పారావుని అధ్యక్షుడిగా నియమించే నాటికి ఆయనకి ఏడేళ్ళు. ప్రజాసంఘాలతో ప్రజా ఉద్యమాలతో అలా మొదలైన ఆయన పరిచయం దినదినాభివృద్ధి చెందింది. నాజర్ మొదలుకుని సలాది భాస్కరావు, కోసూరి పున్నయ్య లాంటి వారిచేత హరికథలు, బుర్రకథలు ఏర్పాటు చేయడం నుంచి ట్రేడ్ యూనియన్ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గోవడం దాకా ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీకి అర్థశతాబ్దానికి పైగా తన సేవలందించారు. ఏటుకూరి బలరామ్మూర్తి, పరకాల పట్టాభిరామారావు, మహీధర రామ్మోహనరావు, చండ్ర రాజేశ్వరరావులాంటి ఉద్దండులతో సన్నిహితంగా మెలిగిన అప్పారావుగారు ఏంగెల్స్ రాసిన డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్, దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ లోకాయత రచనల ద్వారా ప్రభావితమై బౌద్ధాభిమాని అయ్యారు. తెన్నేటి విశ్వనాథం రెండాకుల గుర్తుపై పోటీ చేసినప్పుడు ఎంతో ఉత్సాహంగా ప్రచారం చేసిన అప్పారావుగారు స్వతంత్రాలోచనా స్వేచ్ఛను గౌరవించలేనితనం

చూసి అన్ని సంఘాలకీ దూరమై 'సమాజ చైతన్య వేదిక'ను ఏర్పర్చి మార్క్స్, ఏంగిల్స్, రాహుల్ సాంకృత్యాయన్, అనాగరక ధమ్మపాల, పెరియార్, పూలే మొదలైన మహనీయుల ఆలోచనల్ని సమాజానికందించేందుకు కృషి చేసారు. వివిధ ప్రగతిశీల సంఘాల మధ్య, మేధావుల నడుమ సమన్వయం లోపించడమే ప్రజాసంఘాల ప్రధాన లోపమనే ఆయన 'సమన్వయం' పేరుతో పత్రిక స్థాపించీ సుమారు రెండు దశాబ్దాలుగా ఎన్నో ఒడిదుడుకులెదుర్కొంటూ నడుపుతున్నారు. కొంతకాలం స్వంతంగా టైలరింగ్ నేర్చుకుని ఉత్తరాంధ్రలో మొట్టమొదటి టైలర్ల సంఘాన్ని నడిపించిన ఆయన ఉద్యమాల వెంటపడి ఉన్నదంతా పోగొట్టుకున్నారు. 72లో సూర్యకాంతంగార్ని వివాహం చేసుకున్న అప్పారావు కుటుంబమంతా తనపైన అసంతృప్తిగా ఉండటం న్యాయమేనంటూ ఎన్నో కష్టనష్టాల్ని వోర్చుకునే తన అర్థాంగి గొప్పతనం ముందు తానో అల్పుడ్నేనంటారు. పీకాక్ క్లాసిక్స్ గాంధీ, సోషలిస్ట్ స్టడీ సెంటర్ ఎన్. అంజయ్య, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ రాధాకృష్ణమూర్తి ఇంకా ఎంతోమంది ఆత్మీయులుగా, మిత్రులుగా గల అప్పారావుగారు ఈ 70 ఏళ్ళ వయసులో కూడా నిత్యం కార్యక్రమాలు చేస్తుంటారు. "బుద్ధిస్ట్ స్టడీ సర్కిల్" వ్యవస్థాపకులుగా గ్రామీణ, గిరిజన ప్రాంతాల్లో వేల పుస్తకాల్ని వుచితంగా పంపిణీ చేస్తుంటారు. మహనీయుల జీవితాల్ని కరపత్రాలుగా ముద్రించి విద్యార్థులకు, యువతకు పంచుతుంటారు. ఆయనెక్కడికెళ్ళినా మరొకరికి ఇవ్వడానికి ఎప్పుడూ ఆయన సంచిలో పుస్తకాలుంటాయంటే అతిశయోక్తి కాదు. లేవనీ, వొద్దనీ, తన వల్ల కాదనీ ఎన్నడూ అనని ఆయన ఒకప్పుడు జీవించిన జీవితం దాదాపు కనుమరుగై స్వప్రయోజనాలతో చుట్టుముట్టిన వారంతా ఈరోజు మొహం చాటేసినా అధైర్యపడడు. పదుల సంఖ్యలో అనేకమంది పెద్దల రచనల్ని తానే ముద్రించిన ఆయన ఒకవైపు ఆర్థికంగా తీవ్ర ఇబ్బందులెదుర్కొంటూ కూడా 100 మంది మహనీయుల జీవితగాథల్ని కరపత్రాలుగా తేవడమే నా ఆశయమంటుంటే ఆ ఔన్నత్యానికి జోహార్లర్పించకుండా ఉండలేం.





# 7

## ప్రజా పక్షపాతి
# తోటకూర కృష్ణమూర్తిరాజుగారు

నిరాడంబరత ఆయన తత్వం. నిజమైన ఆదర్శం ఆయన వ్యక్తిత్వం. పెండాల్య లంక భూములపై కపిలేశ్వరపురం జమీందారుకి వ్యతిరేకంగా గిడ్డి ఉద్యమం చేసిన కమ్యూనిస్టు కొర్రపాటి పట్టాభిరామయ్యను పోలీసులు వెంటబడి తరుముతుంటే స్నేహితుడితో కల్సి బొబ్బర్లంక కాలవ దాటించడానికి నావ నడిపి రక్షక భటులతో సుష్టుగా దెబ్బలు తిన్న అనుభవమాయనది. ప్రజా ఉద్యమకారుడు పూర్ణచంద్రరావుని చెట్టుకు కట్టి కాల్చేస్తే స్కూలు పిల్లల్ని అక్కడకు తీసుకెళ్ళి పరిశీలనకు పెట్టి బాలలచేతనే నిజనిర్ధారణకు సిద్ధపడిన నిబద్ధతాయనది. మహోజ్వల తెలంగాణ సాయుధ పోరులో ఉధృతంగా విప్లవకారుల్ని అంతమొందిస్తున్నప్పుడు గోదావరి లంకల్లో రెల్లుగడ్డి పొదల మధ్య అజ్ఞాత జీవితం గడుపుతున్న యోధులు పుచ్చలపల్లి సుందరయ్యకు ప్రాణాలకు తెగించి భోజనం తీసుకెళ్ళిన తెగింపాయనది. ఏ.బి.కే.కు ఆంధ్రజ్యోతి వీక్లీలో ప్రూఫులు చూడ్డానికి సాయపడినా, శ్రీశ్రీని విజయవాడ మనోరమలో గదిని తీసి రాత్రింబవళ్ళు తాగకుండా వారించినా, కె.వి. రమణారెడ్డి ప్రభంజనం పత్రిక ప్రారంభ సంచికావిష్కరణకు శ్రీశ్రీతో కల్సి వెళ్ళి తిరుగు ప్రయాణంలో తరిమెల నాగిరెడ్డితో కల్సి 'తాకట్టులో భారతదేశం' గ్రంథాన్ని పెడన, మచిలీపట్నం, గుడివాడల్లో అమ్మినా అవి ఆయన ప్రజాపక్షపాత ధోరణికి వీసమెత్తు చిహ్నాలే. ఆయనే తోటకూర కృష్ణమూర్తిరాజుగారు. తూర్పుగోదావరి జిల్లా ఆత్రేయపురంలో 1935లో పుట్టినాయన మెట్రిక్యులేషన్ చేసి విద్యార్థి దశలోనే ప్రగతిశీల భావాల్ని వొంటపట్టించుకున్నారు. ఎస్.ఆర్.ఎమ్.టి.లోనూ, టివిఎస్‌లోనూ చాలాకాలం ఉద్యోగం చేసారు. దశాబ్దంపాటు హోటల్ నడిపారు. వివాహానంతరం నిడదవోలుని కార్యక్షేత్రంగా చేసుకున్నారు. శ్రీశ్రీ, వరవరరావు, చలసాని మొదలగువారు మొదలుకుని దిగంబర కవుల దాకా సాన్నిహిత్యం ఉండేది. శ్రీకాకుళ సాయుధ పోరాటంలోకి తీసుకోమని అప్పట్లో బెజవాడొచ్చిన ఒక నక్సల్బరీ నాయకుడ్నడిగితే వ్యసనపరుడు ఉద్యమకారుడు

కాలేదన్న ఆయన మాటవిని కాలుస్తున్న సిగరెట్‌ను అప్పటికప్పుడు కృష్ణానదిలో విసిరేసారు. కారణాంతరాల వల్ల ప్రత్యక్ష పోరాటంలోకి పోకపోయినా, ఇప్పటిదాకా మళ్ళీ సిగరెట్టు ముట్టలేదు. విశాలాంధ్ర కార్టూనిస్టుగా చేస్తున్న టి.వి.ని తీసుకుని తామాడ గణపతి, సుబ్బారావు పాణిగ్రహిని కల్సి చర్చించడం మంచి అనుభవమనే ఆయన విరసం మొదలుకుని హక్కుల సంఘాల అభిమానిగా చాలాకాలం నుంచున్నారు. 2005లో ప్రముఖ గ్రంధాలయోద్యమ నాయకులైన గద్దే రామ్మూర్తిగారి ప్రోత్సాహంతో 'అమరం' పత్రిక స్థాపించి నడుపుతున్నారు. వినియోగదారుల ఉద్యమానికీ, హేతువాద ఉద్యమానికీ, లోక్‌సత్తా ఉద్యమానికీ నాయకుడిగా ఉన్నారు. అలాగే చిన్న పత్రికల సంఘానికి రాష్ట్ర అధ్యక్షుడిగా, సమాచార హక్కు చట్టం ప్రచార ఐక్యవేదికకు రాష్ట్ర ఉపాధ్యక్షుడిగా ఉన్నారు. 1895లో భార్య బంగారమ్మ గతించిన నాటి నుండీ ఒంటరిగానే ఉంటూ సమాజహితం కోసం వివిధ కార్యక్రమాలు చేబడుతున్న కృష్ణమూర్తిరాజుగారు 81 సంIIరాల వయస్సులో కూడా పౌరులు, పౌర ధర్మాన్ని పాటించే విధంగా పార్టీలు ఉండని కారణంగా మనకి పార్టీస్వామ్యమే కాని ప్రజాస్వామ్యం లేదంటూ, రాజ్యాంగాన్ని అమలు చేయాలనే ప్రబల కాంక్షని ప్రజల్లోకి తీసుకెళ్ళడం ద్వారానే మార్పు సాధ్యమంటారు. ఫూలేపై రాసిన వ్యాసానికి దళిత సాహిత్య అకాడమీ పురస్కారాన్ని అందుకున్న ఆయన రాజ్యాంగాన్ని విద్యార్థి దశనుంచే పాఠ్యాంశంగా బోధించడం, దాని ప్రాధాన్యతను గుర్తింపజేయడం ద్వారానే ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, ప్రజాస్వామ్యం సాధ్యమవుతుందని ముక్తాయిస్తారు. మరి ఆ స్ఫూర్తిని గ్రహించడం మన కనీస బాధ్యత కదా!





## 8

### కారుచీకటిలో కాంతిరేఖ

# కళాశ్రమ రవీంద్రశర్మగారు

గ్రామసీమలు దేశానికి దేహం లాంటివి. వాటిని బలోపేతం చేయడం ద్వారానే దేశాభివృద్ధి సాధ్యపడుతుంది. సమాజం సజావుగా నడవడానికి సమిష్టిగా నిర్మితమయినవే సంస్కృతులు. శతాబ్దాలుగా భిన్నత్వంలో ఏకత్వం భారద్దేశ ఉనికికి సారం. వందల ఏళ్ళుగా గాలీ, నీరు, నింగి, నేల, ప్రకృతి, ప్రాణులతో పెనవేసుకున్న ప్రాణాలు ఈ దేశపు పల్లెసీమల అస్తిత్వానికి ఆయువుపట్టులాంటివి. విచ్చలవిడి శాస్త్ర సాంకేతికత మనిషి మానసిక అస్థిరతకు కారణమైంది. విశృంఖల నాగరికత మనిషి ఆంతరిక జడత్వానికి మూలమైంది. నిత్యం నూతనోత్తేజభరిత వాతావరణంలో కళకళలాడిన గ్రామాలు అనాధల్లా మిగులుతున్నాయి. మానవ సంబంధాల్లోని మమతానుబంధాలకు నెలవైన సంస్కృతీ సంప్రదాయాలు చేవచచ్చి శవయాత్రల్లా కనిపిస్తున్నాయి. ఈ వినాశకరమైన పరిణామాల్ని విధానాల ద్వారా మార్చాలని తపించే మానవిక శక్తులు అడక్కడక్కడా కొన్నున్నాయి. అందులో ఒకటి కళాశ్రమం. నిజానికి ఇదో 'కాలాశ్రమం'. కాలానికి అతీతంగా ఎదురీదుతున్న కార్యాశ్రమం. అందుకు నిబద్ధతగా దశాబ్దాలుగా కృషి చేస్తున్న వ్యక్తి రవీంద్ర కుమార్ శర్మగారు. దేశ విభజన సమయంలో ప్రాణాలరచేత పెట్టుకుని పంజాబ్ నుంచి వలసవొచ్చి ఆదిలాబాద్‌లో స్థిరపడిన పూర్వీకులు. శర్మగారి జననం ఆదిలాబాద్‌లోనే. బాల్యం నుంచీ శర్మగారికి పల్లె సంస్కృతి పట్ల విపరీతమయిన పిచ్చుండేది. అణుచుకోలేని ఆతృతుండేది. బుడబుక్కలివాళ్ళు, గోసమోలు, హరిదాసులు, పిట్టలదొరలు, జంగమదేవరలు, పగటివేషగాళ్ళ వెంబడి తిరిగేవారాయన. నకషాలనే జాతి పిల్లలతో ఉంటూ రంగుల్ని అద్దడం చేసేవారు. ప్రకృతిలోని వర్ణాలన్నీ ఆయనకు వర సంపదగానే కనిపించేవి. గోపాలకృష్ణ, నారాయణస్వామి మఠాలు ఆధ్యాత్మిక జీవనానికి దారి చూపేవి. ఎనిమిదేళ్ళ వయసుకే కర్రసాము నేర్చి 'గురూజీ'గా మారిన శర్మ, పదహారేళ్ళకి సొంత వ్యాయామ కళాశాల స్థాపించారు. సమస్యలతో

సతమతమయ్యేవారికి సలహాలిచ్చేవారు. స్వదేశీ వస్త్రాలనే ధరిస్తూ ఖద్దరు బట్టలతో నిలువెత్తు బొట్టుతో చూసేవారికి మతవాదిలా కనిపిస్తారాయన. ఎడ్లబండిమీద వందలాది ఆదివాసీ గ్రామాలు తిరిగి అధ్యయనం చేసినాయన చేతివృత్తులు చితికిపోవడానికి, పల్లెలు ఆర్థికంగా దివాళా తీయడానికీ కారణాల్ని వెలికితీసేందుకు ప్రయత్నించారు. ఒక వర్షాకాలం రాత్రి తనకి చలి తగలకుండా గ్రామీణుడు వెలిగించిన అగ్నిసాక్షిగా జీవితాన్ని చేతివృత్తుల వారికోసం అంకితం చేస్తానని శపథం చేసిన శర్మగారు కాలాశ్రమం స్థాపించి నిషికాంత్, యల్లప్పతాతల సాయంతో బరోడాలో కొద్దికాలం చదివారు కూడా. అక్కడ నస్రీన్ మొహ్మదీ అనే గురువు సాంగత్యం శర్మగారి జీవితాన్ని మలుపు తిప్పింది. 'కళ'కి అర్థాన్ని ఆమె నుంచే నేర్చుకున్నానని వినయంగా చెప్పే ఆయన తన దృష్టికొచ్చిన ప్రతీ కళారూపాన్నీ సూక్ష్మంగా గ్రహించి కానీ ఒదిలిపెట్టలేదు. కొద్దికాలం ప్రభుత్వ పాఠశాలలో గౌరవ వేతనానికి పనిచేసినా తర్వాత మానేశారు. శర్మగారు వారి మనిషేనని భావించిన ఆర్.ఎస్.ఎస్. వాళ్ళు ఆయన్నో సభకి ఆహ్వానించగా 'మీలో హిందూ ఎవరంటూ' ఆయన వేసిన ప్రశ్నల దుమారానికి తట్టుకోలేక 'మమ్మల్ని తిట్టకండం'టూ వేడుకున్నారు. అలాగే వామపక్ష మిత్రులొకసారి 'కొమురం భీం' సినిమాకి ఆర్ట్ డైరెక్టర్‌గా పెట్టుకున్నప్పుడు 'మనుస్మృతి'ని వర్మ నినదించడం చూసి ముక్కుమీద వేలేసుకున్నారు. కులమతాలపై ఆయన భావాలు ప్రమాణాలు కావు. ఐనప్పటికీ ఆయన చెప్పే కథలు, చూసే దృష్టీ కొత్తగా ఆకర్షిస్తుంటుంది. గాంధేయవాదుల్నుండి మహామార్క్సిస్టుల వరకూ అనేక రాష్ట్రాల్నుంచి కూడా ఆయనాశ్రమాన్ని సందర్శిస్తారంటే అదే కారణం. ఉన్నత విద్యాధికుడైన శ్రీనివాస్ నుంచీ తెలుగులో రచయితగా పేరొందిన వాడ్రేవు చినవీరభద్రుడి దాక, వినూకాలే, వుజారమ్మాలాంటి సామాజిక కార్యకర్తలు మొదలుకుని రజనీభక్షీలాంటి ప్రముఖ పాత్రికేయులవరకూ శర్మగారి అద్వితీయమైన ప్రజ్ఞాపూరిత దృక్పథాన్ని దర్శించుకోడానికొచ్చే వారెందరో. కొన్ని అంశాల్లో విభేదాలున్నప్పటికీ ప్రజల జీవన సంస్కృతుల్ని సజీవంగా వుంచడానికై రవీంద్రశర్మగారు చేస్తున్న కృషికి జోహార్లర్పించకుండా ఉండలేం.





# 9

## చెరిగిపోని విప్లవతృష్ణ
## కృష్ణాబాయిగారు

ఆమొక మామూలు రైతు కుటుంబంలో పుట్టింది. భూస్వామ్య వాసనలు పోని వాతావరణంలో పెరిగింది. భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల్ని ఉరితీసిన రోజు వంటింటి అలమారు తలుపులోపల 'విప్లవం వర్ధిల్లాల'ని రాసిన వాళ్ళన్నయ్యని నాన్న కొట్టిన సందర్భం బాల్యంలోనే కృష్ణాబాయిగారి పసి మనసుపై ముద్ర వేసింది. కుటుంబంలో బొత్తిగా కమ్యూనిస్టు ప్రభావం లేకపోలేదు. ఆ ప్రభావంతోనే 1952 ఎన్నికల్లో కృష్ణాబాయిగారి తల్లి చల్లపల్లి రాజాకి వ్యతిరేకంగా ఓటు వేయగలిగింది. రాజేశ్వర్రావు, సీతారామయ్య నిర్వాహకులుగా పి.సి. జోషీ, సహజానంద సరస్వతి, రాహుల్ సాంకృత్యాయన్, సోహన్‌సింగ్ భాక్నాలాంటి ఉద్దండులొచ్చిన 1944 బెజవాడ అఖిల భారత రైతు మహాసభలకు విరాళంగా తన చేతి గాజుల్నిచ్చేసిందామె. బాబాయిచేత దెబ్బలు తిని 'దర్తీ కే లాల్' సినిమా చూడటం మొదలుకొని గాంధీని హత్యచేసిన మర్నాడు స్కూలుకి నల్ల బ్యాడ్జి పెట్టుకొని వెళ్లడం దాకా ఆమెలో ఒక తరహా నిరసన ఎప్పుడూ దోబూచులాడేది. అందుకే త్రిపురనేని రామస్వామిగారి 'వివాహవిధి' ప్రకారమే పెళ్ళికి సైతం పట్టుబట్టారామె. విప్లవ రాజకీయాలకు ఆమె ప్రత్యక్ష సాక్షి. విరసం వ్యవస్థాపనలో ఆమెది ప్రధాన పాత్ర. జీవితం లాగానే ఉద్యమంలో కూడా లెక్కలేనన్ని ఒడిదుడుకులతో సహవాసం చేసారామె. శ్రీశ్రీ షష్టిపూర్తినాడు విశాఖ విద్యార్థులు వేసిన ప్రశ్నకు బాధ్యతాయుతమైన సాక్షామె. తెలంగాణ సాయుధ పోరాటం, శ్రీకాకుళ ఉద్యమం, ఎమర్జెన్సీ నిషేధం ఇలా ఎన్నెన్నో అనుభవాల్ని మూటకట్టుకున్నామె ఎంతోమంది సహచరుల్ని కూడా అర్థాంతరంగా కోల్పోయారు. సాంస్కృతిక విప్లవాన్ని మినహాయించి చేసే సాయుధ పోరాటమంటూ వేరే ప్రత్యేకంగా ఏదీ ఉండదనే కృష్ణాబాయిగారు ప్రగతిశీల సంఘాల్లో, ఉద్యమంలో సైతం చీలికలకు సైద్ధాంతిక విభేదాలే కారణమంటారు. అలాగే ఏ ఉద్యమ

నిర్మాణానికైనా ప్రాతిపదిక అభిప్రాయాలే కాని కులాలు కావనే ఆమె ఉద్యమాల్లో అగ్రకులాధిపత్యం అమలౌతోందనడం సరికాదంటారు. సహజంగానే చైతన్యలేమి కారణంగా ప్రజా ఉద్యమాల్లో స్త్రీలు, యువత రావడం లేదంటూ స్త్రీలే ప్రత్యేకంగా వివక్షకు గురవుతున్నారంటే ఒప్పుకోనంటారు. అసమానతలు లేని సమాజం కోసం ఈనాటికీ తనవంతు ప్రయత్నంగా రచనా వ్యాసంగం మొదలుకుని యువతను ప్రోత్సహించడందాకా ఎంతో కృషి చేస్తున్న కృష్ణాబాయికి వయసు ఎనభై పై చిలుకే. ఈ తరం ఆమె స్ఫూర్తిని కొనసాగించాలని కోరుకుందాం.





# (10)

## ముసురుకున్న సాహిత్య పిపాసి

# ముంగర జాషువాగారు

ఆయనో నిత్య పఠనావేశపరుడు. నిరంతర తత్వశాస్త్ర అధ్యయనశీలుడు. 15వ ఏటనే 'గాంధీజీకి లేఖ' నే కరపత్రం రాసి సమాజాన్ని సంస్కరించడానికి ఆయన్ని మళ్ళీ పుట్టమని అభ్యర్థించినవాడు. విద్యార్థి దశలోనే మిత్రులకు వందలాది ప్రేమలేఖలు రాసి భావ కవిత్వపు ధారల్లో మునిగితేలినవాడు. కృష్ణశాస్త్రి, నాయని, రాయప్రోలుల రసికతను రంగరించుకొంటూనే పెరియార్, ఎమ్జీఆర్‌ల రాజకీయ దృక్పథాన్ని ఒంటబట్టించుకొని కొన్నాళ్ళందులో ఈదినవాడు. ఆయనే ముంగర జాషువా. 67 సం॥రాల వయసులో కూడా అలుపెరుగని జిజ్ఞాస ఆయనిది. 70ల్లోనే ఉపనిషత్తుల్ని లోతుగా అధ్యయనంచేసి 'మనసంటే ఏమిటి?' అనే శోధనాత్మక రచన చేసినాయన, 'గీతిక' అనే సాహిత్య పత్రికను నడపడమే కాక కరుణశ్రీ, నాగరాజశర్మ, స్ఫూర్తిశ్రీ, కడియాల రామ్మోహన్‌రాయి, కొండపర్తి శేషగిరిరావు, బెల్లంకొండ సూర్యప్రకాశరావు, వారణాసి కోటేశ్వరశర్మ, పెద్దాడ సుబ్బయ్యశాస్త్రి, దర్భా భాస్కరం మొదలగువారి కవితలతో 'కళిక' అనే సంకలనాన్ని చాలాకాలం క్రిందటే ప్రచురించారు. ప్రసిద్ధ రచయిత శరత్‌ను అమితంగా ఇష్టపడే ఆయన చాలా దశాబ్దాలు సంజీవ్‌దేవ్‌కు సన్నిహితుడిగానున్నారు. లెక్కలేనన్ని అనుభవాల్నీ, ఉత్తర ప్రత్యుత్తరాల్నీ దార్శనికుడైన సంజీవ్‌దేవ్‌తో నడిపిన జాషువాగారు నాగార్జున సాగర్‌లో 'సంజీవ్‌దేవ్ మెమోరియల్ ఆర్ట్స్ అకాడెమి'ని స్థాపించడమే కాక తెలుగులో సాహిత్య, సాంస్కృతిక కళాభిరుచుల్ని ప్రచారం చేసేందుకై 2008లో ఆచార్య ఈమని శివనాగిరెడ్డిగారి ఆధ్వర్యంలో మరికొంతమంది వదాన్యుల సహకారంతో 'రసరేఖ' పత్రికను నడుపుతున్నారు. మొదట్లో 100 పేజీల్లో వెలువడిన రసరేఖను తర్వాత కుదించారు. జాషువా గబ్బిలాన్ని నేటి వ్యవస్థకు అన్వయించి 'మరో గబ్బిలం' అనే సృజనాత్మక రచన చేస్తున్న ముంగర అనేక చింతనాత్మక వ్యాసాలు రాయడమే కాక

ఎంతోమందికి పి.హెచ్‌డిలు చేయడంలో సహకరించారు కూడా. ఇన్ని విషయాల్లో తలమునకలౌతూ కూడా అవధానం ప్రక్రియలో ప్రావీణ్యం సంపాదించి 'దశావధానం' ద్వారా తన ప్రత్యేకతను చాటుకొంటూన్న జాషువా 78లో నిర్మలగార్ని ప్రేమ వివాహం చేసుకొని చాలా సం॥రాలు ఆవిడకి చిత్రలేఖనం నేర్పించారు. నిర్మలగారు లేకుంటే తాను లేనని చెప్పే ఆయన 30 సం॥రాలు ఉద్యోగంలో కష్టపడి కూడా సాహిత్యంలో తనకంటూ స్థానాన్ని నిలబెట్టుకున్నారు. భావభౌతిక వాదాల సమన్వయంతో కూడిన Epistimological Enquiry దిశగా సామాన్య ప్రజానీకాన్ని సంజీవ్‌దేవ్ దృక్పథం సాయంతో చైతన్యపర్చడమే తన లక్ష్యమనే జాషువాజీ తన కృషిని కొనసాగించాలని కోరుకుందాం.





# 11

## జనం కోసమే ఆయన

# జె.యస్. రఘుపతిరావుగారు

ఆయనొకప్పుడు ఆధ్యాత్మికవాది. ప్రఖ్యాత మళయాళ స్వామికి చెందిన వ్యాసాశ్రమంలో దాదాపు 12 సం॥రాలు గడిపారు. అలాగే రామకృష్ణ మఠంలో చాలాకాలమున్నారు. మెహర్‌బాబా భక్త సమాజం, ప్రేమ సమాజం మొదలుకుని, సర్వోదయ సమాజం దాక అన్నింట్లోనూ వున్నారు. స్వామి వివేకానంద, అరవిందులు, జిడ్డు కృష్ణమూర్తి మొదలగువార్ని లోతుగా అధ్యయనం చేసి అన్వేషణకు నాంది ఏర్పర్చుకున్నారు. మరోవైపు గోరాగారి పరిచయంతో నాస్తిక హేతువాద శాస్త్రీయ మార్గాల్ని సైతం మధించారు. అంబేద్కర్ జీవితాధ్యయనం చూపిన ప్రభావానికి ముగ్ధులై బుద్ధుడూ, జిడ్డు కృష్ణమూర్తి, అంబేద్కర్ చూపిన దారుల్ని ఒక్కదరికి చేర్చడం కోసం తన వంతుకు మించి పాటుపడుతున్నారు. ఆయనే జె.ఎస్. రఘుపతిరావు, వయసు 84 సం॥రాలు. గుంటూరు జిల్లా భట్టిప్రోలు వద్ద కోనేటిపురంలో 1932 జల్లి పెదరామయ్య, నరసమ్మ దంపతులకు మే 10న పుట్టిన రఘుపతిరావుగారు చెన్నై గిండీ కాలేజీలో ఇంజనీరింగ్ చేసి అనేక ప్రాంతాల్లో 33 సం॥రాలు ఉద్యోగం చేసి రిటైరయ్యాక కూడా ఎస్.వి. విశ్వవిద్యాలయం నుంచీ ఎమ్.ఎ. ఇంగ్లీష్, అన్నామలై యూనివర్శిటీ నుంచీ ఎమ్.ఏ. సోషియాలజీ, అంబేద్కర్ యూనివర్శిటీ నుంచి ఎమ్.ఏ. తెలుగు చేసారు. కుటుంబ మిత్రత్వం ద్వారా అన్నపూర్ణమ్మగార్ని కులాంతర వివాహం చేసుకుని ఆవిడ్ని ఎమ్.ఏ., పి.హెచ్‌డి. చేయించి సంగీతం టీచరుగా ప్రోత్సహించారు. ఆమె ఉద్యోగం కోసమే తిరుపతిలో స్థిరపడ్డారు. హేతుబద్ధమైనదాన్ని స్వీకరించే గుణం మొదట్నుంచీ తనకుందనే ఆయన బౌద్ధం, జి.కృష్ణమూర్తి తత్వం, అంబేద్కరిజాన్ని సమన్వయపరుస్తూ 60కి పైగా రచనల్చేసారు. 'వనవాసి' పత్రికను షెడ్యూల్డ్ క్యాస్ట్ వెల్ఫేర్ అసోసియేషన్ తరఫున దశాబ్దంపాటు నడిపినాయన తన భావాలకు అనుగుణంగా 'తక్షణం' మాస పత్రికను మార్చే

లక్ష్యంగా స్థాపించి నడిపిస్తున్నారు. రాష్ట్రమంతా పర్యటిస్తూ సామాజిక మార్పుకోసం, విద్యార్థులు, యువతలో జీవితావగాహన పెంచడం కోసం యువజన వికాస్ పేర్తో శిక్షణా కార్యక్రమాల్ని నిర్వహిస్తుంటారు. బౌద్ధాన్ని, జిడ్డు కృష్ణమూర్తి తత్వంతో పోల్చడం సమకాలీనంగా నున్న కొద్దిమంది బౌద్ధులకు మింగుడు పడలేదనే ఆయన బుద్ధుడు తప్ప నిజమైన బుద్ధిస్టు మరొకరు లేరంటారు. అలాగే అగ్రకులాధిపత్యం, పురుషాహంకారం, చీలికలేర్పర్చుకునే గుణాలే ఉద్యమ సంఘాల్ని దిగజార్చా యంటారు. తిరుపతిలో సద్దమ్మ బుద్ధ విహారను నిర్మిస్తున్నారు. యువతకు సామాజిక స్పృహ కల్పించడమే లక్ష్యంగా ముందుకెళుతున్న జె.యస్. రఘుపతిరావుగారు అంతిమంగా మానవాళిని మార్చగలిగేది మానసిక విప్లవమే కాని మరేదీ కాదనే స్పష్టతతో ఆచరణకు పూనుకోవడం ముదావహం.





## 12

### మడమతిప్పని ధైర్యం

# మల్లు స్వరాజ్యంగారు

ప్రజా ఉద్యమాలకు ఆమె స్వరం పర్యాయపదం. ప్రజాపక్ష కార్యక్రమాలకు ఆమె గళం ఒక పరిమళం. వ్యవస్థ బాగుకోసం ఉద్భవించే ఏ విధమయిన మార్పుకయినా వెన్నుదన్నుగా నిలిచి వెనుదీయని ఉత్సాహంతో ముందుకెళ్లడమే ఆమెకు తెలిసిన నైజం. ఆమె మల్లు స్వరాజ్యం. పట్టుమని పదిహేనేళ్ళైనా నిండకుండానేనిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ఆయుధం పట్టి పోరాడి పదుల సంఖ్యలో దాడుల్నీ, వివిధ కేసుల్ని ఎదుర్కొన్న చరిత్రామెది. నాటి రోజుల్లో ఈ నారి ధాటికి తాళలేని నిజాం సర్కారామెపై పదివేల రూపాయిల రివార్డు కూడా ప్రకటించిందంటే ఆనాటి ఆమె ధాటిని అర్థం చేస్కోవాల్సిందే. నల్గొండజిల్లా తుంగతుర్తి మండలంలో పుట్టినామె తల్లికి స్వాతంత్ర్యోద్యమంపై మక్కువ కారణంగా 'స్వరాజ్యం' అనే పేరు పెట్టింది. స్వరాజ్యంగారికి ఇద్దరు సోదరులు, మరో యిద్దరు సోదరీమణులు, భూస్వామ్య కుటుంబం. భీంరెడ్డి నర్సింహారెడ్డి స్వరాజ్యానికి అన్న. అలాగేప్రసిద్ధ విప్లవకారుడు దేవులపల్లి వెంకటేశ్వర్రావుగారు కుటుంబానికి సన్నిహిత మిత్రులు. ఆ ప్రభావం ముగ్గురు అక్క చెల్లెళ్ళ మీదా పడింది. మాక్సిమ్ గోర్కి 'అమ్మ' నవల్ని ఆబగా చదివిన రోజుల్నుంచీ, విజయవాడలో పార్టీ అధ్యయన తరగతులకి హాజరవడం వరకూ స్వరాజ్యంగారిది స్వయంగా రాటుదేలిన వ్యక్తిత్వమే. విశ్వవిద్యాలయాలకు అతీతమయిన పాండిత్యమే. సహచరులు రంగమ్మ, రావులమ్మ, అచ్చమ్మ మొదలైన వారితో కల్సి తాను స్వయంగా కూర్చిన 'ఉయ్యాల' పాటతో వందలాది గ్రామాల ప్రజల్ని ఉత్తేజపరుస్తూ అజ్ఞాత జీవితానికి అసలైన పరమార్ధాన్ని చెప్పిన ఆమె, అజ్ఞాత జీవితంలోనే పరిచయమైన వెంకట నర్సింహారెడ్డిగారితో జీవితం పంచుకున్నారు. మద్యపాన వ్యతిరేకోద్యమం మొదలుకొని మహిళా సాధికారతో ద్యమందాకా ఆరితేరినామె తుంగతుర్తి నుంచి పోటీ చేశారు కూడా. దాదాపు 400

గ్రామాల్ని విముక్తం చేసిన తెలంగాణ పోరాటంలో లెక్కలేనన్ని మారుపేర్లతో చలామణీ అవుతూ ప్రమాదకరమైన పరిస్థితుల్ని ఎదుర్కొన్నామె యువత, స్త్రీలు అవసరమైనప్పుడు ఉద్యమాల్లోకి వస్తారన్న ధీమాను వ్యక్తం చేస్తారు. పార్లమెంటరీపద్ధతిలోనే యింకా మార్పుకోసం కృషి చేయాల్సుందనే ఆమె పార్టీలో అగ్రకులాధిపత్యం, మగపెత్తనం ఉన్నాయంటే ఒప్పుకోరు. పిల్లలకు తన భావాల్నందించడంలో విఫలమయ్యామని సూటిగా చెప్పే ఆమె ఎప్పటికైనా కమ్యూనిస్టు విప్లవమే శరణ్యమనే స్వరాజ్యంగారి నమ్మకానికి ఆమె నమ్మిన సిద్ధాంత నిబద్ధతే ప్రమాణం.





## 13

### పోరుగువారి బాగే ముఖ్యం

# పొనుగుమట్ల విష్ణుమూర్తిగారు

ఆయనో ఉద్యమ సైనికుడు. తన జాతి జనుల కోసం కలం పట్టిన అక్షర హాలికుడు. బాల్యం నుంచే అవమానాల సుడిగుండాలెన్నింటినో తట్టుకుని పీడితుల గొంతును వినిపించడం కోసం విశ్రాంతి లేకుండా సాగిస్తున్న సమానత్వ నినాద సమరమాయనది. అంబేద్కర్ ఆశయ సాధనలో తానో నిబద్ధతగల సమిధనని సగర్వంగా ప్రకటించుకునే విష్ణుమూర్తి 6-9-1945న కేంద్రపాలిత ప్రాంతమైన యానాంలో పేదకూలీ కుటుంబంలో పుట్టారు. అగ్రకుల బ్రాహ్మణీయ దురహంకారం పచ్చిగా అమలవుతున్న రోజులవి. నాటి రోజుల్లో కులాధిపత్యాన్ని చాలా దగ్గరగా చూసారాయన. అప్పటికే 'శ్రీ దీనపోషక సమాజం' యానాం, అంబేద్కర్ నగర్‌లో ఏర్పడి ఎన్నో సంస్కరణలకు స్వీకారం చుట్టింది. అప్పట్లో యానాంలో ఫ్రెంచ్ మీడియంలో చదివితే పుదుచ్చేరి వెళ్ళి చదువులు చదవాల్సొచ్చేది కాన జార్జిపేటలోని ఆది ఆంధ్ర పాఠశాల్లో విష్ణుమూర్తి చదివారు. అలా అనేక కష్టనష్టాలనోరుస్తూ ఉన్నత విద్యనభ్యసించారు. ప్రఖ్యాత వైద్య కళాశాలైన జిప్‌మర్‌లో ఒక సంవత్సరం చదివి ఆర్థిక పరిస్థితి సహకరించనందున మానేశారు. 1975లో నాస్తిక నాయకులు, సంఘ సంస్కర్త గోరాగారి ఆధ్వర్యంలో సుగుణను వివాహం చేసుకొన్నారు. ఈనాడు, ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, యు.ఎన్.ఐ. (న్యూఢిల్లీ) వంటి ప్రసార మాధ్యమాల్లో ఎంతో అనుభవం గడించి పింగళి దశరథరామ్, కమెండో నాగరాజు, ఏబికె వంటి వారి సాన్నిహిత్యంతో బొల్లోజు బసవలింగం గారి ప్రోత్సాహంతో 1980లో 'జనమిత్ర' పత్రికను ప్రత్యామ్నాయ భావజాల ప్రతీకగా స్థాపించారు. అంతకుముందే సిద్ధార్ధ ప్రెస్ స్థాపించి ప్రచురణ రంగంలో ప్రవేశించిన ఆయన కొంతకాలం లైబ్రేరియన్‌గా కూడా చేసారు. యానాంలో తొలి రిజిస్టర్ పత్రికది. దళిత బహుజనుల కోసం పూర్తిగా అంకితమైన జనమిత్రకు దేశవిదేశాల్లో వేలమంది పాఠకులున్నారంటే అతిశయోక్తి కాదు. ఎన్నో సంచలన వ్యాసాల్ని పత్రికలో రాసిన విష్ణుమూర్తిగారు,

అనేక సంఘాలు స్థాపించారు. వివిధ కులాంతర వివాహాలు జరిపించారు. రిజర్వేషన్ పుట్టుపూర్వోత్తరాలపై పుస్తకం రాసారు. ప్రముఖ రచయిత, దళిత వాయిస్ సంపాదకులైన వి.టి. రాజశేఖర్ (కర్నాటక) గారి కోరికపై 'క్రైస్తవులు-దళిత విమోచన' అనే రచనను ఆయన అనువదించారు. బాబాసాహెబ్ అంబేద్కర్ రాజ్యాంగ సభలో చేసిన అద్భుతమైన ప్రసంగాలను అనువదించారు. సమాచార హక్కు చట్టం ప్రచార ఐక్యవేదిక ఆ పుస్తకాన్ని 20,000 కాపీలు ముద్రించింది. అలానే అనేక వ్యాసాలు, రేడియో ఉపన్యాసాల్ని ప్రచురించారు. దీనపోషక సమాజ చరిత్రను పునర్ముద్రించారు. బ్రాహ్మణత్వానికీ, బ్రాహ్మణద్వేషానికీ దళిత నాయకులు తేడా తెలీకుండా ద్వేషాన్ని పెంపొందిస్తున్నారని చెప్పే విష్ణుమూర్తిగారు నిత్యం తనవద్ద కొచ్చే ఎంతోమంది సమస్యలు పరిష్కరిస్తూంటారు. భారతీయ దళిత సాహిత్య అకాడెమీ అధ్యక్షుడిగా, చిన్న పత్రికల రాష్ట్ర గౌరవాధ్యక్షుడిగా, ఇంకా ఎన్నో రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ సంఘ సభ్యులైన విష్ణుమూర్తి నిరంతరం జాతీయ, అంతర్జాతీయ కార్యక్రమాలెన్నింటికో హాజరవుతుంటారు. 5000 పైబడి సర్క్యులేషన్ గల జనమిత్రకు ఫ్రాన్స్‌లో అభిమానులుండటం ఆశ్చర్యమే గానీ విష్ణుమూర్తిగారి నిబద్ధతకు అదో నిదర్శనం. హెల్త్‌టాక్ అనే ఆరోగ్యసంబంధ పత్రికను కూడా తన మిత్రులైన డా॥ శిరీష గారి సహకారంతో నిర్వహిస్తున్న విష్ణుమూర్తిగారు అంబేద్కర్ ఆశయ సాధనకు తనవంతు అంకితమవ్వడమే జీవిత ధ్యేయమంటారు. ఆయన ధ్యేయం నెరవేరాలని కోరుకుందాం.





# 14

## చారిత్రక సేవకు ప్రతినిధులు

# చర్ల సోదరీమణులు



వాళ్ళిద్దరూ మానవత్వానికి మచ్చుతునకలు, స్వచ్ఛందసేవకు నిలువెత్తు నిదర్శనాలు. తోటివాళ్ళ కోసం ఆలోచించడానికే సమయం లేని సమాజానికి తమ ఆచరణతోనే మౌనంగా సమాధానం చెప్పగల చేవ గలవారు. వారే చర్ల మృదుల, చర్ల విదుల సోదరీమణులు. తండ్రి చర్ల గణపతిశాస్త్రిగారు మహాజ్ఞాని. శతాధిక గ్రంథకర్త. స్వాతంత్ర్య సమరయోధులు. ఉద్యోగం వొదిలి గ్రామాభివృద్ధికి వ్యవసాయం చేసిన వీరులు. గాంధీగారి పిలుపందుకుని జైలుకెళ్లిన యోధులు. అనేక భాషలలో దిట్టయిన శాస్త్రిగారు 'ఆర్షవిజ్ఞాన పరిషత్ సాహితీ వేదిక' 'కస్తూరిబా మహిళా సమాజం' స్థాపకులు. కళాప్రపూర్ణ, సాహిత్య బ్రహ్మ, కేంద్ర సాహిత్య అకాడమీ బిరుదాంకితులు. తల్లి సుశీలమ్మకూడా అపూర్వ వ్యక్తి. అంతటి మహోన్నతమైన ఆయన వ్యక్తిత్వపు ప్రతీకలే ఈ సోదరీమణులు. 1943 ఫిబ్రవరి 4న విదుల, 1944 ఫిబ్రవరి 4న మృదుల జన్మించారు. తండ్రి సామాజిక స్పృహను, సంస్కరణాభిలాషను పుణికిపుచ్చుకున్న వీరిద్దరూ ఉన్నత విద్యనభ్యసించి ఉద్యోగాలు చేసినప్పటికీ అంతిమంగా స్వచ్ఛంద సేవలోనే సంతృప్తి వెతుక్కున్నారు. చర్ల సుశీల వృద్ధాశ్రమాల్ని నిడదవోలు, మల్లవరం, బొబ్బర్లంక, కొవ్వూరులలో స్థాపించడమే కాక విశాఖలో సైతం 'విశ్రాంతి' అనే వృద్ధాశ్రమాన్ని స్థాపించారు. సంతానంచేత వొదిలివేయబడిన వృద్ధ జంటలు మొదలుకొని సమాజం బహిష్కరించిన బాధితులెందర్నో సేవ ద్వారా వీరు ఆదరిస్తున్నారు. తండ్రి సాహిత్య కృషి పట్ల గల గౌరవంతోనూ, సాహిత్యంపై చిన్నప్పట్నుండీ గల ఆసక్తితోనూ సమాజహితం కోరే కొన్ని ప్రచురణల్ని ప్రజలకు అందించారు. అలాగే గణపతిశాస్త్రి గారి సాహిత్యాన్ని పునర్ముద్రించే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. సేవకు అడ్డంకవుతుందనే భావంతో వివాహాలు కూడా చేసుకోని ఈ చర్ల సోదరీమణుల నిబద్ధతకు నిజాయితీగా తలొంచి హాట్సాఫ్ చెప్తూ వారి ఆచరణలో వెయ్యోవంతైనా అనుసరించేందుకు ప్రయత్నిద్దాం.

# 15



## రంగరించిన మానవత్వం
# రంగినేని మోహన్రావుగారు

అలక్ష్యం వ్యక్తుల జాడ్యం. అసమానత వ్యవస్థలోని రోగం. సంక్షేమం ప్రశ్నార్థకమైన చోట స్తబ్ధత తాండవిస్తుంది. చైతన్యం చొరబడలేని వేళ అజ్ఞానం నర్తిస్తుంది. ప్రేమను పొందలేని మనసు మానవతను మన్నించలేదు. ఆదరణ కరువయిన బాల్యం ఆత్మీయతను అనుభూతి చెందలేదు. రోగగ్రస్తులుగా వుంటున్న పిల్లలకు తనవంతు ఆసరా రంగినేని మోహన్రావుగారు. అలాంటి వారికి అండ రంగినేని ఛారిటబుల్ ట్రస్ట్. నిజామాబాద్ జిల్లా కామారెడ్డి తాలూకాలో ఒక ముంపు గ్రామం మోహన్రావు సొంతూరు. అక్కడ్నుంచీ కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకాలో వచ్చి పడ్డారు. నలుగురన్నదమ్ములు, ఒక ఆడబిడ్డ. గంభీరావుపేట, సిరిసిల్ల, గూడెం, ముస్తాబాదల్లో చదువు సాగింది. హెచ్ఎస్సి తప్పడంతో పొలం పనులు చూసుకునే మోహన్రావుగారు కొద్దికాలం అడవిలో కాంట్రాక్టర్ వద్ద జీతమున్నారు కూడా. ముంబైకి వెళ్ళి వ్యసనాలన్నీ ఒంటబట్టించుకుని చేతులు కాల్చుకున్నాయన తర్వాత ధాన్యం వ్యాపారం మొదలుపెట్టి రైసుమిల్లులు పెట్టి నిలదొక్కుకున్నారు. జగిత్యాలలో ఉంటున్నప్పుడే గూడేనికి సర్పంచ్గా ఇండిపెండెంట్గా పోటీచేసి ఎన్నికయిన ఆయన సమాజానికి ఏదైనా చేయాలంటే రాజకీయాలు మార్గం కావని ఆలస్యంగా గ్రహించి ఒక సం॥రంలోనే రాజీనామా చేసి అందర్నీ ఆశ్చర్యపరిచారు. అనంతరం సిరిసిల్లలో పదెకరాల స్థలంలో రంగినేని సుజాత మోహనరావు ఎడ్యుకేషనల్ ట్రస్ట్ను స్థాపించి వందలాది మంది పిల్లలకు ఉచిత విద్య, వసతి మొదలగు సౌకర్యాలన్నిటినీ కల్పిస్తున్నారు. అలాగే వృద్ధాశ్రమాన్ని కూడా నడుపుతున్నారు. ఖమ్మంలో కూడా ఇలాంటి సంస్థ పెట్టాలనుకున్నా ఒక సంవత్సరం పెట్టాక అనివార్య కారణాల వల్ల కుదరలేదనే ఆయన రాజూరి శేఖరయ్య, చిట్నేని సుధాకర్రావు మొదలైన జీవితకాల సభ్యులతో తూడి వెంకట్రావు మాస్టారు నిర్వహణా బాధ్యతలు చూస్తుండగా సిరిసిల్ల



శివార్లలో స్వయంగా నివసిస్తూ పర్యవేక్షిస్తుంటారు. శ్రమమీద గౌరవంలేని సమాజం అభివృద్ధిని సాధించలేదనే ఆయన కుల, మత వర్గ, లింగ, ప్రాంత వివక్షలకు తావులేకుండా బాల్యం నుంచే పిల్లలకి శ్రమైక జీవన సౌందర్యంపట్లా, సంస్కృతి పట్లా సదవగాహన కల్పిస్తున్నారు. విలువైన గ్రంథాలయం, విశాలమయిన తరగతి గదులు, ప్రయోగశాల వంటి వసతుల్ని కల్పించినాయన సాహిత్యంలో కృషి చేస్తున్న వారికి రంగినేని ఎల్లమ్మ (తల్లి) పేరుమీద పురస్కారమిస్తున్నారు. పత్తిపాక మోహన్, జూకంటి జగన్నాథం, మద్దికుంట లక్ష్మణ్, పెద్దింటి అశోక్ల సాయంతో సాహితీరంగ కృషిని సైతం గుర్తించి సత్కరిస్తున్నామనే ఆయన చుక్కా రామయ్య, కేతు విశ్వనాథరెడ్డి, ఎన్. గోపి, సి. నారాయణరెడ్డి, జస్టిస్ సుదర్శన్రెడ్డి, జస్టిస్ చంద్రకుమార్ లాంటివారు ఆశ్రమానికొచ్చి స్ఫూర్తినందించారంటారు. ఇప్పటికి చాలాకాలంగా ఓటు వేయని మోహన్రావుగారు ఇంజనీరుకున్న గౌరవం, వేతనం ఒక రైతు పొందగలిగితేనే వ్యవస్థ వృద్ధి చెందుతుందంటారు. సాంఘిక పురోగతికి కులమత వివక్ష గొప్ప అడ్డంకని చెప్పే ఆయన ప్రతీ సం॥రం పెద్ద ఎత్తున ఒకరోజు జాతీయస్థాయిలో సభ పెట్టి కార్యక్రమం చేస్తుంటారు. సహకరించే దాతల పేర్లను వివరాలతో సహా నల్లబల్లమీద రాసే ఆయన స్వచ్ఛంద సేవకులు దొరికితే సంస్థను మరింత విస్తరించే ఆలోచనుందంటారు. సేవారంగంలో, విద్యారంగంలో కృషికి తెలుగు విశ్వ విద్యాలయం పురస్కారం ప్రకటిస్తే దాన్ని తీసుకోడానికి సిగ్గుపడి వేరే మాష్టార్ని పంపిన మోహన్రావుగారి నిరాడంబరత నిత్య జీవితంలో కూడా కనిపిస్తుంది. పిల్లలకు తాతగా, పెద్దలకు కొడుగ్గా హైద్రాబాద్లోని సెంటర్ ఫర్ సోషల్ చేంజ్ లాంటి సంస్థల సహకారంతో ఆదర్శాన్ని ఆచరించి చూపుతున్నాయన సేవారంగానికొక విలువైన దిక్సూచి.

# 16



## కదిలే విజ్ఞాన సర్వస్వం
# కందా నాగేశ్వరరావుగారు

పుస్తకం ఆయన ప్రియనేస్తం. ప్రజా సాహిత్య ప్రచారం ఆయన కార్యక్రమం. సాధారణ పార్టీ కార్యకర్తగా మొదలయిన కందా గారి ప్రస్థానం ఆద్యంతం సామాజిక హితం. గుంటూరు జిల్లా చిలకలూరిపేట ఆయన స్వస్థలం. ఎస్.ఎస్.ఎల్.సి. వరకూ చదివారు. మొదట్నుండీ జనాలకి ఏదో విధంగా ఉపయోగపడాలనే తపనతో తపించిపోయి ఉద్యోగాల్లో ఇమడలేక ఉద్యమకారునిగా మారారు. ఆ క్రమంలో అక్షరదీప్తి కార్యక్రమంలో చురుగ్గా పాల్గొన్నారు. తద్వారా తలెత్తిన మద్యపాన వ్యతిరేకోద్యమంలో ముందుండటమే కాక 'సారా సంహారం' నాటికను వందకిపైగా గ్రామాల్లో ప్రదర్శించీ ఉద్యమానికి ఊపునిచ్చారు. శాస్త్రవిజ్ఞాన ప్రచారోద్యమాలు మొదలుకునీ నాస్తిక హేతువాద ఉద్యమాలదాకా అన్నింటినీ చవిచూసి అంతిమంగా ప్రజల్ని చైతన్యవంతం చేయడాన్ని మించిన ఉద్యమం మరేదీ లేదనే నిర్ణయానికొచ్చారు. స్నేహలత ప్రెస్‌ను స్థాపించి చేతులు కాల్చుకున్న అనుభవం ఆయన ఆశయాన్ని అడ్డగించలేకపోయింది. అలా ఒక్క రూపాయి ధరపెట్టి అచ్చువేసిన వేమన పద్యాల పుస్తకం అత్యంత ప్రజాదరణ పొందడంతో ఇక వెనుదిరిగి చూడలేదు. 15 సంవత్సరాల్లో 15 వేలకు పైగా పాఠశాలల్లో సామాజిక స్పృహ, గుణాత్మక – కళాత్మక విద్యకి సంబంధించీ తరగతులు చెప్పి పొడుపుకథలు, నీతిపద్యాలు, చైతన్య గీతాలు చెప్పి అలరించిన ఆయన రాష్ట్రంలోని 200 మండలాల్లో టీచర్ ట్రైనింగ్‌లో పాల్గొని ఉపాధ్యాయులకి పాఠాల్చెప్పారు. మొహంపై పక్షవాతం రెండుసార్లు దాడిచేసినా, బోన్ కేన్సరొచ్చి భయపెట్టాలని చూసినా, అప్పుడప్పుడూ కుటుంబ సభ్యులు వారించినా, వెనకడుగు వేయక ఏడు రూపాయిలకో పుస్తకం, పాతిక రూపాయలకో సి.డి.ని ఇస్తూ మళ్ళీ వాటిల్లో కూడా సెట్‌గా తీసుకున్నవారికి డిస్కౌంటిచ్చే ఆయన ఔన్నత్యం ముందు మహా ఉద్యమకారులు కూడా మనకి



మరుగుజ్జుల్లా కనబడకమానరు. 75లో సీతమ్మగార్ని వివాహం చేసుకున్న నాగేశ్వరరావుగారు పిల్లలందరికీ దండల పెళ్ళిళ్ళే చేసి ఆదర్శాన్ని ఆచరణలో నిరూపించారు. గుంటూరు జిల్లా ఎడ్లపాడులో సుందరయ్యగారి వర్ధంతి రోజున ఆయన అభిమానులు కందాకి సన్మానం చేసి ఇచ్చిన 5000/– రూపాయిల్ని కూడా ప్రచురణకే ఖర్చుపెట్టానని సగర్వంగా చెప్పుకునే కందా, పుస్తక ప్రచురణనేది సామాజిక బాధ్యతే కాని లాభసాటి వ్యాపారం కాదంటారు. నవ తరాలకి స్ఫూర్తినిచ్చే మహనీయుల జీవితచరిత్రల్ని నామమాత్రపు ధరలో వారికి అందించడానికి అవకాశమొస్తే ప్రయత్నిస్తానంటారు. దేశభక్తి పాటలు మొదలుకుని జానపద గేయాల దాకా అద్భుతమయిన సి.డి.ల్ని స్వయంగా చేసి ప్రజలకి చేరువచేస్తూ తెనాలి రామకృష్ణ, అక్బర్ బీర్బల్, సైన్స్, సైంటిస్టుల, పంచతంత్ర, నీతి, చిట్టికథలు, శతకాలు, సూక్తులు, సామెతలు.. లాంటి విలువైన పొత్తాల్ని కూడా ప్రజానీకంలోకి తీసుకెళ్తూ, ఈనాటిదాకా లక్షల సంఖ్యలో పాఠకుల్ని, ముఖ్యంగా బాలల్నీ ప్రేరేపిస్తూ, అరవై ఐదు సం॥రాల వయసులో సైతం భార్య, పిల్లల సాయంతో స్వయంగా బైండింగు, కటింగు, పిన్నింగు చేసుకుంటూ అసంఖ్యాకమంది ప్రజలకి తక్కువ ధరల్లో పుస్తకాల్ని చేరువచేయడాన్ని మించిన విప్లవం మరేదీ లేదని చెప్పే కందాగారి నిబద్ధతకు ఎవరైనా కళ్ళప్పగించి **హేట్సాఫ్** చెప్పాల్సిందే.

# 17



### కళ ప్రజలకోసం

## కె. శాంతారావుగారు

కళ ఎందుకోసమనేదొక జిత్తులమారి ప్రశ్న. కళ యొక్క లక్ష్యాన్ని నిర్లక్ష్యపర్చి కళను కొందరికే పరిమితం చేసే జిత్తులమారితనం ఈ ప్రశ్నకు పునాది. దానిని ఎదుర్కొనేందుకు తెగించిన వ్యక్తుల కథలే కళా తపస్వుల చరిత్రలు. అందులో ఒకరు శాంతారావుగారు. కృష్ణాజిల్లా పెడన స్వస్థలం. బాల్యం నుండీ గ్రామీణ వాతావరణంలోని చేనేత కార్మికుల కష్టాలు కడగండ్లతో పాటూ కళల్ని కూడా దగ్గరగా చూసాడాయన. అలా 10వ తరగతిలోనే రంగస్థలంపై ప్రదర్శన ఇచ్చాడు. బళ్ళా ఈశ్వరుడనే రచయిత, ప్రజా నాట్యమండలి, సురభి, స్థానిక నాటక సంస్థల పరిచయం వెరసి ఆయన హృదయాన్ని ఒక నాటక ప్రయోగశాలగా మలిచాయి. అలాగే అలుగోత్సవం పేరుతో గుండెల్ని కోసుకోవడం, పేరిణీ శివతాండవం, నారసాలు నాలుకకి గుచ్చుకోవడం మొదలగు కార్యక్రమాలు ఆయనలోని కళానుభూతికి కదనరసాన్ని జోడించాయి. తర్వాత బందరులో నుండగా కూడా ఆ ఉత్సాహం కొనసాగింది. ఆంధ్రా యూనివర్శిటీలో సోషల్‌వర్క్ చదూతుండగా ప్రేమ సమాజం, మెంటల్ హాస్పటల్, సెంట్రల్ జైలు, బోస్టన్ స్కూలు ఎంతో నేర్పాయి. యూనివర్శిటీ బెస్ట్ మిమిక్రీ ఆర్టిస్టుగా రావిశాస్త్రిగారి చేతుల మీదుగా బహుమతందుకున్న శాంతారావుగారు 'నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా' బి.వి. కారత్ డైరెక్టర్‌గా నున్నప్పుడు 70 రోజులపాటు నిర్వహించిన వర్క్‌షాప్‌లో పాల్గొనడం తన జీవితాన్ని మలుపుతిప్పిందంటారు. కృష్ణారావనే మిత్రుని ద్వారా మార్క్సిజం తెలుసుకొన్న రావుగారు 5 సం॥రాలు ప్రజాశక్తి దినపత్రిక ఉపసంపాదకుడిగా చేసారు. నాటక రంగంలో నాలుగు దశాబ్దాల అనుభవంతో 50కి పైగా నాటకాల్ని రచించి దర్శకత్వం వహించారు. ప్రజానాట్య మండలిలో 25 ఏళ్ళు ఉన్నారు. అప్పుడే దేవిగార్ని వివాహం చేసుకున్నారు. ప్రజాకళాతపస్వి డా॥ గరికిపాటి రాజారావుగారి గూర్చి గ్రంథాన్నీ ప్రచురించారు. జీవ పరిణామంలో మానవ దశ ఎలాంటిదో, నాటక పరిణామంలో వీధి నాటక దశ అలాటిదనే ఆయన ఠాగూరు కళకిచ్చిన నిర్వచనం 'కళంటే సత్యం, సౌందర్యాల రసవత్సమ్మేళనం' అనేది సరైనదంటూ ప్రపంచీకరణ ప్రభావంతో కుదేలుపడిన కళను బ్రతికించుకోవడం మనందరి కర్తవ్యమంటూ సామాన్య ప్రజానీకాన్ని చైతన్య పర్చడంలో వీధి నాటికను మించిన మాధ్యమం లేదంటారు. మరాయన కృషి ఫలించాలని ఆశిద్దాం.



# 18



### అల్లూరి చరిత్ర నిర్మాత

## పడాల వీరభద్రరావుగారు

ఆయనో వాస్తవ శోధకుడు. శతాధిక గ్రంధకర్త, ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త, అల్లూరి చరిత్ర వాస్తవ శోధకులు, ఎఐటియుసి జాతీయ కార్యవర్గ సభ్యుడు పడాల రామారావుగారి కొడుకుగా, ఎన్టీఆర్ ముఖ్యమంత్రిగా నుండగా రవీంద్రభారతిలో అల్లూరి గురించిన ఉత్సవాన్ని జరిపాడేకాని ఇంతవరకూ మరే ముఖ్యమంత్రీ అల్లూర్ని పట్టించుకోలేదనే బాధాయనది. అల్లూరిపై అద్వితీయ రచన చేసిన తండ్రి స్ఫూర్తిని జీర్ణించుకున్న పడాల అల్లూరి జీవితంపై స్వయంగా మన్యం ప్రాంతాలన్నీ పర్యటించీ ఎన్నో విలువైన విషయాలు సేకరించారు. అల్లూరి జీవితంపై ప్రచారమౌతోన్న కట్టుకథల్ని వ్యతిరేకించారు. అల్లూరి సీతారామరాజు ప్రియురాలిగా చలనచిత్రంలో సైతం చూపించిన సీత నిజానికతని సోదరని నిరూపించారు. అలాగే ప.గో.జిల్లా మోగల్లు అల్లూరి జన్మస్థలమనే ప్రచారాన్ని ఖండిస్తూ ఈ అంశంపై ప్రభుత్వం వేసిన కమిటీ రిపోర్టుని వివరిస్తూ ఆయన పుట్టింది విశాఖజిల్లా పాండ్రంగి గ్రామమని నిర్ద్వందంగా చెబుతారాయన. అల్లూరి కుటుంబ సభ్యులకు అత్యంత సన్నిహితంగా మెలగటం మొదలుకొని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి అధికారిక రికార్డుల్లో బందిపోటు దొంగలుగా నమోదు చేయబడ్డ రంప విప్లవకారుల్ని స్వాతంత్ర్యోద్యమకారులుగా గుర్తింజేసిన సంఘటన వరకూ, అల్లూరి పై నాటకాలు, బుర్రకథ రాసి గ్రామగ్రామాన  ప్రదర్శించిన నిబద్ధత నుండీ అల్లూరి స్మారక ప్రదేశాల్ని వెలికితీసేంతదాకా పడాల రామారావుగారి పాత్ర ఎన్నదగిందేనంటారాయన. 1952 ఎన్నికల్లో గూడెంనించి మల్లుదొర ఎన్నికల్లో పోటీ చేసినప్పుడు రామారావు ఆయన తరపున ప్రచారం కూడా చేసారంటారు. పడాల రామారావు షష్ఠిపూర్తికి భగత్‌సింగ్ సహచరుడు విజయ్‌కుమార్ సిన్హా మొదలుకునీ, జ్ఞానానందకవి వరకూ ఎందరో హాజరవడం చారిత్రక ఘట్టమంటారు. చౌచౌ అనే కలర్ పత్రికను 10 సం॥రాల పాటు మద్రాసులో ముద్రించి హిగ్గిన్‌బాథమ్స్‌తో సంబంధం పెట్టుకుని జాతీయ స్థాయిలో నడిపిన ఘనత పడాల రామారావుగారికే దక్కిందనే వీరభద్రరావుగారు అల్లూర్ని చూసిన బాల్‌దొరని తాను కలవడం మంచి అనుభూతంటారు. అల్లూరి జీవితాన్ని వాస్తవాల ఆధారంగా శోధించి రేపటి తరాలకందించాలనే తపనతో అల్లూరి సీతారామరాజు యువజన సంఘం నాలుగున్నర దశాబ్దాల క్రితమే స్థాపించి ఎన్నో విలువైన వ్యాసాలు, ఉపన్యాసాలు, స్మారక మందిరాలు, విగ్రహాలు రావడానికి కారణమైన ఆయన తమ సంఘం తరపు నుండీ కొన్ని డిమాండ్లను కూడా పాలకుల ముందుంచారు. అల్లూరి జీవితంపై ఈనాటి దాకా వచ్చిన రచనల్ని, సమాచారాన్ని సేకరించారు. స్వాతంత్ర్యోద్యమంలో అల్లూరి పాత్రపై జాతీయ సదస్సు సైతం విశ్వవిద్యాలయ సహకారంతో తలపెట్టారు. చరిత్ర రచనకి నిజాలే ప్రాతిపదిక కావాలని కాంక్షించే అరవై అయిదు సం॥రాల ఈ నవయువకుడి ఆకాంక్షలు నెరవేరాలని ఆశిద్దాం.

# ముక్తాయింపు

మరికొంత మందుంటారేమో ఈ సంపుటిలో చేర్చాల్సినవాళ్ళింకా. ఆరంభంలోనున్న వుత్సాహం ఆఖరున కూడా అలాగే వుందంటే ఆచరణ యింకా కొనసాగుతుందనడానికో సూచిక. ఐనా, విరామం తప్పనిసరి కాబట్టి ఈ ఇంతమందిని మాత్రమే ఎంచుకున్నా. దీనర్థం వీళ్ళమీద ప్రత్యేక అభిమానం కలదని కాదు. మిగతా వారి ప్రాధాన్యత తగ్గించాలనే తపన అసలే లేదు. ఇంకా ప్రశ్నించడమే పాలసీగా పెట్టుకున్న విజయవిహారం రమణమూర్తిగారి దగ్గర్నుంచీ వెనుదీయని చైతన్యశీలి వెనేపల్లి పాండురంగారావు (మట్టి మనుషులు) దాకా అడుగుజాడ రవికాంత్‌గారు మొదలుకుని వివేచనాత్మక ప్రచారశీలి బి.వి. రాధాకృష్ణమూర్తిదాకా సాగిపోయే ఆచరణాత్మక బౌద్ధమయిన నాగాబత్తుల జగన్నాథంగారితో ఆరంభించి మానవతావాది మానేపల్లి సత్యనారాయణగారి దాకా ఆలోచనాత్మక చైతన్యశీలి పలికల రాముగారితో ప్రారంభించి సమసమాజమే లక్ష్యంగా సాగుతున్న చంద్రగిరి సాంబశివరావుగారి దాకా ఎందరినో ఇంకా పరిచయం చేయాల్సే ఉంది. కాన చేయాల్సిన పనింకా చాలా ఉంది. ఒక్కడిగా ఈ పనిని నెత్తికెత్తుకోడానికి దారితీసిన పరిస్థితుల్ని ముందుగానే వక్కాణించి వున్నాను. కాన ఈ క్రమంలో మీకనిపించిన భావాల్నీ, లోటుపాట్లను నా దృష్టికి తేవడానికి ప్రయత్నిస్తే సరిచేసుకుందుకు ప్రయత్నిస్తానని సవినయంగా మనవి చేసుకుంటూ ప్రత్నామ్నాయ భావజాలాన్ని వ్యాప్తి చేసేందుకు నిజాయితీగా జరుగుతున్న ప్రయత్నాల్లో వొక నిబద్ధతకల భాగంగా మాత్రమే దీన్ని చూడాల్సిందిగా విజ్ఞప్తిచేస్తూ, ఇంతకాలం సొంత సిద్ధాంతాలతో కాలాన్ని వెళ్ళబుచ్చిన మిత్రులూ, నాపై ఏదో రకంగా ఎప్పటికీ పడేద్చే అమిత్రులూ అంతా ఏదో కార్యాచరణలో ముందుండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ ఇక్కడితో సెలవు తీసుకుంటున్నాను.